శ్రీ ర స్తు.



శ్రీమదాంధ్రభాగవతమునం

# అంబరీషోపాఖ్యానము

టీకాతాత్పర్యసహితము








చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

1924.

శ్రీరస్తు.

# అంబరీషోపాఖ్యానము

## టీకాతాత్పర్యసహితము.

---

శ్లో. జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం,
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే.

అవతారిక. నవమస్కంధాదియందు శుకబ్రహ్మర్షి సూర్యవంశమును వర్ణించుచు నందుఁ జేరిన యంబరీషమహారాజు ప్రస్తావనతో బ్రాహ్మణశాపమునుగూడఁ జెడఁగొట్టెడి శక్తి యతనియందుఁ గలదని చెప్పెను. అది విని పరీక్షిన్మహారాజావిషయము వివరించిచెప్పునట్లు ప్రార్థింపఁగా శుకుఁ డంబరీషునిశక్తి వివరించుటకుఁ బూర్వ మట్టి శక్తికిఁ గారణమైన యతని భగవద్భక్తిని జెప్పుచున్నాఁడు.—

శా. సప్తద్వీపవిశాలభూభరము దోస్స్తంభంబునం బూన్చి సం
ప్రాప్తశ్రీయుతుఁడై మహావిభవ సంపచ్చాతురిం గల్గి దు
ర్వ్యాప్తింబొందక వైష్ణవార్చనల మేరంగాలముం బుచ్చుచుం
నుప్తింబొందక యొప్పె సద్గుణగరిష్ఠుం డంబరీషుండిలన్. 1

టీక. సత్ గుణ గరిష్ఠుండు = జ్ఞానము మొదలగు మంచి గుణముల చేత మిక్కిలి గొప్పవాఁడైన, అంబరీషుండు=అంబరీషమహారాజు, సప్త... భరమున్-సప్తద్వీప = ఏడు ద్వీపములుకలదై, విశాల=విరివియైన, భూ= భూమియొక్క, భరమున్ = (పరిపాలనా) భారమును, దోః స్తంభంబునన్=(తన) బుజమనెడి కంబమునందు, పూన్చి=ధరించి, సంప్రాప్త శ్రీ యు

తుఁడై=మిక్కిలి విశేషముగా లభింపఁబడిన సంపదతోఁ గూడినవాఁడై, మహా...చాతురిన్-మహత్ విభవ=(భోగ్యపదార్థములు, భోగసాధనమైన వస్తువులు, భోగయోగ్యస్థలములును) ననెడి గొప్ప విభవమును, సంపత్ చాతురిన్=ఐశ్వర్యమును సంపాదింపఁదగిన సామర్థ్యమును, కల్గి=కలిగి యుండియు, దుర్వ్యాప్తిన్=(చెడు మార్గములందుఁ దనబుద్ధిని వ్యాపింపఁ జేయుట యనెడు) దుర్గుణమును, చెందక=పొందక, వైష్ణవ అర్చనలన్ - వైష్ణవ=విష్ణుమూర్తికిఁ జేసెడి, విష్ణుభక్తులకుఁ జేసెడి) అర్చనలన్= పూజలయొక్క, మేరన్=మర్యాదతో, కాలమున్ పుచ్చుచున్=కాలక్షేపము చేయుచు, సుప్తి= (ముందుచెప్పిన సత్కార్యములందు) అజాగ్రత్తను, పొందక, ఇలన్=భూలోకమున, ఒప్పెన్=లోకవిలక్షణుఁడై ప్రకాశించెను.

తాత్పర్యము. వివేకము మొదలగు సద్గుణములుగల యంబరీషమహారాజు సప్తద్వీపములతోఁగూడిన యీభూమినంతయు నేలుచు, గొప్పయైశ్వర్యమును దానికిఁదోడు భోగ్యభోగసాధన భోగస్థానము లనెడి మహావిభవమును వీనిని సంపాదింపఁదగిన చాతుర్యమును గలిగియుండియు నీయైశ్వర్యమే స్థిరమనిభావించి యందే మునిఁగి దుర్మార్గములందు వ్యాప్తి పెట్టక మిక్కిలివైరాగ్యముతో నుండెను. అంతటితోనే పర్యవసింపక శ్రీవిష్ణుమూర్తికిని దద్భక్తులకును నజాగ్రత్తాలేశమైనను లేక సదా పూజలు సలుపుచునే కాలము పుచ్చుచుండెను. ఇట్లుండుటచేనతఁడు లోకములోని వారివలెఁ గాక విలక్షణుఁడై కన్పట్టుచుండెను.

జంబూ, ప్లక్ష, కుశ, క్రౌంచ, శాక, శాల్మలి, పుష్కరము లని సప్తద్వీపములు.

అవ. అంబరీషుఁడు వైష్ణవార్చనలతోఁ గాలముపుచ్చిన సంగతిని వివరించి చెప్పుచున్నాఁడు.—

సీ. చిత్తంబు మధురిపుశ్రీపాదములయందు
పలుకులు హరిగుణపఠనమందు

కరములు విష్ణుమందిర మార్జనములంద
శ్రవములు హరికథాశ్రవణమంద
చూపులు గోవిందరూప వీక్షణమంద
శిరము కేశవనమస్కృతులయంద
పదము లీశ్వరగేహ పరిసర్పణములంద
కామంబు చక్రి కైంకర్యమంద
తే. సంగ మచ్యుతుని గుణసంఘమంద
ఘ్రాణ మసురారిభక్తాంఘ్రికములయంద
రసన తులసీదళములంద రతులు పుణ్య
సంగతులయంద యారాజచంద్రమునకు. 2

టీ. ఆ రాజచంద్రమునకున్ = రాజశ్రేష్ఠుఁడైన యా యంబరీషుని యొక్క, చిత్తంబు=మనస్సు, మధు...పాదములయంద-మధురిపు=శ్రీవిష్ణుమూర్తియొక్క, శ్రీ=భక్తుల కాశ్రయింపఁదగినట్టి సౌలభ్యముతో వెలయుచున్న, పాదములయందున్ అ=చరణములందే (తగిలియుండును.), పలుకులు=మాటలు, హరి గుణపఠనమందున్ అ=(ఆశ్రితులపాపములను హరించెడి) శ్రీవిష్ణుమూర్తియొక్క సుగుణములను వర్ణించుటయందే (దృఢమైయుండును) కరములు=చేతులు, విష్ణుమందిర మార్జనములందున్ అ = విష్ణుమూర్తిదేవాలయమును శుద్ధిచేయుటయందే(ఉపయోగపడుచుండును), (మార్జనపదముచేత సమస్తకైంకర్యములును వివక్షితములే), శ్రవములు= చెవులు, హరికథాశ్రవణమందున్ అ=విష్ణుమూర్తిచరిత్రములను వినుటయందే (ఆశపడుచుండును), చూపులు గోవింద రూపవీక్షణమందున్ అ=శ్రీవిష్ణుమూర్తియొక్క దివ్యమంగళవిగ్రహమును దర్శనముచేసికొనుటయందే(స్థిరమైయుండును), శిరము=తల, కేశవ నమస్కృతులయందున్ అ=సకలదేవోత్తముఁడైన విష్ణుమూర్తిని నమస్కరించుటయందే, (ఉపయుక్తమై యుండును.) పదములు=కాళ్లు, ఈశ్వర...ములంద - ఈశ్వరగేహ=సర్వేశ్వరుఁ డగు శ్రీ

విష్ణుమూర్తియొక్క మందిరములైన శ్రీరంగ వేంకటాచలాది పుణ్యస్థలములకు, పరిసర్పణములందుఁ అ=పయనమైపోయి ప్రదక్షిణాదులు చేయుటయందే ఆసక్తములై యుండును.) కామము = (పుష్పచందనతాంబూలాదులను ధరింపవలెననెడి) యాశ, చక్రి కైంకర్యమునందుఁ అ=(చక్రాయుధమును ధరించియున్న) శ్రీమన్నారాయణునినిమిత్తముగనే (కలుగుచుండును.) సంగము= సంబంధము, అచ్యుతుని గుణ సంఘమందుఁ అ=శాశ్వతమైన శ్రీమన్నారాయణుని స్వాభావికములైన గుణసమూహములందే (ఉండును )ఘ్రాణము= ముక్కు, అసుర...కమలమంద-అసుర అరి = రాక్షసవిరోధియైన శ్రీవిష్ణుమూర్తియందు, భక్త=భక్తిగల పుణ్యాత్ములయొక్క, అంఘ్రికమలమందుఁ అ=తామరపూవులవంటి పాదములయందే, (భక్తులపాదములు స్వభావముగ సువాసముగలవని భావము.) (వాసన చూచుచుండును.)రసన=నాలుక, తులసీదళములందుఁ అ=(శ్రీవిష్ణుపాదములందలి) తులసీదళములందే (ఆశకలిగియుండెను.), రతులు=సౌఖ్యములు, పుణ్య సంగతులయందుఁ అ = పుణ్యపురుషులైన విష్ణుభక్తులతో వాసము చేయుటయందే (కలుగుచుండును).

తా. అంబరీషుఁడు తన సర్వావయవములను భగవంతుని సకల కైంకర్యములకు నుపయోగింపవచ్చునని యెంచి యట్లుచేయఁదొడఁగెను. అదెట్లనిన: శ్రీమన్నారాయణుని పాదపద్మములనే సదా తనమనస్సుతో ధ్యానించుచుండును. తనవాక్కున భగవంతునిగుణములనేసదావర్ణించుచుండును. తనచేతులతో సదా విష్ణుదేవాలయకార్యములనే చేయుచుండును. తనచెవులతో సదాహరికథలనే వినుచుండును. తనకన్నులతో సదా సర్వేశ్వరుని దివ్యమంగళవిగ్రహములనే దర్శనము చేసికొనుచుండును. తనశిరస్సునకు శ్రీమన్నారాయణుని పాదవందనమే పరమప్రయోజనమనియెంచి సదా యాకార్యమునేచేయుచుండును. తనకు కాళ్లుండుటకు విష్ణుదేవాలయములను ప్రదక్షిణముచేయుటయే పరమ లాభమని యెంచి శ్రీరంగ వేంకటాచలాదివిష్ణుక్షేత్రములకుఁ బోయి యందలివిష్ణుమందిరములకుఁ బ్రదక్షిణముచేయుచుండును. పుష్పచందనతాంబూలాదులను దాను స్వీకరించునప్పుడిది భగవత్ప్రీత్యర్థమే చేయుచున్నావని

యెంచుచుండును తనబంధువులతో నేలాటిజోక్యము పెట్టుకొనక సదా భగవద్గుణములతోడనే కాలము పుచ్చుచుండును. తనముక్కుతో భగవద్భక్తులపాదమూలం దర్శించిన పుష్పముల నాఘ్రాణించుచుండును. భగవంతుని శ్రీపాదములందలి తులసీదళములనే సదా తన నాలుకతో నాస్వాదించుచుండును. భగవద్భక్తులైన పుణ్యపురుషులతో సదా సహవాసము చేయుచు నదియే పరమసుఖమని భావించునుగాని యిహలోకసుఖముల నెన్నఁడైనను దలంపఁడు.

**వ. మఱియు నమ్మహీవిభుండు.**

టీ. మహీవిభుండు = ఆయంబరీషమహారాజు, మఱియు = ఇంకను.

సీ. ఘనవైభవంబున గల్మషదూరుఁడై
యజ్ఞేశు నీశు నబ్జాక్షుఁ గూర్చి
మొనసి వసిష్ఠాది మునివల్లభులతోడ
తగిలి సరస్వతీ తటమునందు
మేధతో బహువాజిమేధంబు లొనరించి
గణుతింపరాని దక్షిణలు వెట్టి
సమలోష్టహేముఁడై సర్వకర్మంబులు
హరి పరంబులు గాఁగ నవనియేలె
ఆ. విష్ణుభక్తులందు విష్ణువునందుఁ గ
లంక మెడల మనసు లంకెవెట్టి
విహితరాజ్యవృత్తి విడువనివాఁడునై
యతఁడు రాచతపసి యనఁగ నొప్పె. 4

టీ. కల్మషదూరుఁడై=పాపహేతువులై స్వలాభమునకుఁ గాఁజేసెడి కార్యములకు దూరముగఁ దొలఁగినవాఁడై, యజ్ఞేశుఁ=సమస్తయాగములకును నిర్వాహకుని, ఈశుఁ = సర్వేశ్వరుని, అబ్జాక్షుఁ = తామరపూవులవంటి నేత్రములుగల శ్రీవిష్ణుమూర్తినిఁగూర్చి, మొనసి=పూని, వసిష్ఠ...వల్లభులతోడఁ=వసిష్ఠమహర్షి మొదలగు ఋషీశ్వరులతోడ, తగిలి=కూడి, మేధ

తోన్ = ఏకార్యము నైనను మఱవనట్టి ధారణారూపమైనబుద్ధితో, ఘనవిభవంబునన్ = గొప్పనైశ్వర్యముతో, బహు వాజిమేధంబులు = అనేకాశ్వమేధయాగములను, సరస్వతీతటమునందున్ = సరస్వతీనదియొడ్డున, ఒనరించి = చేసి, గణుతింపరానిదక్షిణలు = లెక్కపెట్టుటకుసాధ్యముకాని భూరిదక్షిణలు, పెట్టి = ఇచ్చి (బ్రాహ్మణులకనిశేషము), సమలోష్టహేముఁడై = మట్టిపెళ్లయందును బంగారమందును సమబుద్ధికలవాఁడై, సర్వకర్మంబులు = (తానుజేసెడి) లౌకిక, వైదిక సర్వకార్యములును, హరిపరంబులు గాఁగన్ = భగవదుద్దేశముతో నుండునట్లు, అవనిన్ = భూమిని, ఏలె = ఏలెను. అతఁడు = ఆయంబరీషుఁడు, విష్ణుభక్తులందున్ = పరమభాగవతులయందును, విష్ణువునందును, కలంకము = కపటము, ఎడలన్ = లేకుండునట్లు, మనసు, లంకెవెట్టి = సంబంధపఱచి, విహితరాజ్యవృత్తిన్ = (శాస్త్రములందు క్షత్రియునికి) విధించియున్న రాజ్యకార్యమును, విడువనివాఁడునై = వదలక, రాచతపసి అనఁగన్ = రాజు గానుండియు ఋషియైయున్నాఁడని జనులు చెప్పుకొనునట్లు, ఒప్పెన్ = వెలయుచుండెను.

తా. అంబరీషుఁడు తన సమస్తేంద్రియములను భగవత్కైంకర్యమునందే వినియోగించి తనలాభమునకై యొకకార్యమును జేయకుండుటంబట్టి యతని నొక్కపాపమును నంటకుండెను మఱియు నతఁడు సర్వేశ్వరుఁడును బుండరీకాక్షుఁడైన శ్రీమన్నారాయణుఁడేసమస్తయాగములకుఁబరమోద్దేశ్యమని శాస్త్రములందు వినియుండుటచే నతనినిగూర్చి యప్పుడప్పుడు వసిష్ఠాది మహర్షులను జేర్చుకొని ముందువెనుక కార్యములను జక్కఁగ నరయుచుఁదన విభవమునకుఁ దగినట్లు అనేకాశ్వమేధయాగములను జేయుచుండును. అందనేక బ్రాహ్మణులకు నపరిమితముగా భూరిదక్షిణలు పంచిపెట్టుచుండును. ఇంతియకాక తాను చేయు సమస్తకార్యములకును హరియే పరమోద్దేశ్యమని యెంచి సమస్తలౌకికవైదికకార్యములనుహరిపరములుగానే చేయుచుండును. ఇట్లుండుటచే మట్టిపెళ్లను లోకువగా గాని బంగారు నెక్కువగాగాని యతఁడు తలఁచుటలేదు కాన సర్వత్ర సమబుద్ధితోనే రాజ్యమేలుచుండెను. అట్టి రాజ్యమేలుటయు శాస్త్రమున విధించినకార్యమును బరిత్యజింపరాదను

తలంపుతోనేగాని మమతతో గాదు. మఱియు భగవంతునియందును భగవద్భక్తులయందును నిష్కపటమైన పరిపూర్ణభక్తితోనుండెను. జనులు దీనిం గని యీరాజు రాజ్యమేలుచున్నను ఋషులనిష్ఠతోనున్నాఁడు గదా యని పొగడుచుండిరి.

వ. వెండియు నమ్మహాభాగవతుండు. 5

టీ. అమ్మహాభాగవతుండు = మిక్కిలి భగవద్భక్తిగలిగిన యా యంబరీషుఁడు, వెండియు=ఇంకను.

అవ. సర్వకర్మంబులు హరిపరంబులుగాఁగ నతఁడు చేసె ననుటను నిందు విశదముగాఁ జెప్పుచున్నాఁడు —

క. హరియని సంభాషించును
హరియని దర్శించు నంటు నాఘ్రాణించున్
హరియని రుచిగొనఁదలఁచును
హరి హరి ఘను నంబరీషు నలవియె పొగడన్. 6

టీ. హరియని=హరియని (తలఁచి), సంభాషించును=మాటలాడును, (హరియనితలఁచి), దర్శించున్=(వస్తువులను) చూచును, (హరియనితలఁచి) అంటును = (వస్తువులను) దాఁకును, (హరియనితలఁచి) ఆఘ్రాణించును = వాసనచూచును, (హరియనితలఁచి), రుచిగొనన్ = చవి చూచుటను (తలఁచును), ఘనున్ = ఇట్లు సర్వకార్యములను హరిధ్యానముతోఁ జేయుచున్నంతటి గొప్పవానిని, అంబరీషుని, పొగడన్, అలవియె = సాధ్యమా (కాదు), హరిహరి=ఆశ్చర్యము.

తా. అంబరీషుఁడు సంభాషణాది సమస్తకార్యములను హరియే తన మూలమునఁ జేయించుచున్నాఁడనియెంచి చేయుచుండును. మఱియు వాని ఫలని లాభములు శ్రీ హరి ప్రీతికేయని యెంచుచుండును. కాన నీతని మహాత్వము నింత యని పొగడ నెవ్వరికి వీలుకాకుండెను. శ్రీమన్నారాయణుఁడు సర్వాంతర్యామి యని యంబరీషుఁ డెఱిఁగినవాఁడు గాన సంభాషణాది సర్వకార్యములను దా నెవ్వరితోఁ జేయుచున్నను శ్రీహరితోఁ జేయు

చున్నట్టే తలంచును; కాన నితని జ్ఞానాతిశయము పొగడ నెవ్వరికిని వీలు కాదని తాత్పర్యాంతరమును జెప్పవచ్చును.

వ. ఇట్లు పుణ్యచిత్తుండును నీశ్వరాయత్తుండునై యల్లనల్లన రాజ్యంబు సేయుచున్న సమయంబున. 7

టీ. ఇట్లు ముందు చెప్పినరీతిగా, పుణ్యచిత్తుండును = అహంకార మమకారములు లేక పవిత్రమైన మనస్సు కలవాఁడును, నీశ్వర ఆయత్తుండును = శ్రీమన్నారాయణునికి లోఁబడినవాఁడును, ఐ, అల్లనల్లన=తిన్న తిన్నఁగా, (అహంకార మమకారములు తనయొద్ద మరల రానీయక మిక్కిలి జాగ్రత్తతో) రాజ్యంబు = రాజ్యపరిపాలనము, చేయుచున్న సమయంబున.

తా. అంబరీషుఁడు సర్వకార్యములకును దానే కర్త, తానే ఫలభోక్త యని యభిమానము వదలి యీశ్వరుఁడే సర్వమునకుఁ గర్త భోక్తయనియుఁ దానతనికి లోఁబడినవాఁడననియు నెంచి యహంకారమమకారముల సంబంధము మరలఁ గలుగనీయక మిక్కిలి జాగ్రత్తతో రాజ్యపరిపాలనంబు చేయుచుండెను. అట్టి సమయమునందు.

ఆ. అతని కీహమానె హరులందుఁ గరులందు
ధనములందుఁ గేళి వనములందుఁ
బుత్రులందు బంధుమిత్రులయందును
బురమునందు నంతిపురమునందు. 8

టీ. హరులందుక్ = గుఱ్ఱములయందును, కరులందుక్ = ఏనుఁగులందును; ధనములందును, కేళివనములందుక్ = ఆటతోఁటలయందును; పుత్రులందును, బంధుమిత్రులందుక్ = చుట్టాలయందును; స్నేహితులయందును, పురమునందుక్=పట్టణమందును, అంతిపురమునందుక్ = భార్యయందును, అతనికి=ఆయంబరీషునికి, ఈహ=ఆశ, మానెను.

తా. అంబరీషునికిఁ దనసైన్యమందుఁగాని పట్టణమందుఁగాని ధనమునందుఁగాని దారాపుత్రాదులందుఁగాని క్రీడలయందుఁగాని యాశ వదలి పోయెను.

అవ. అంబరీషుఁ డిట్లు వైరాగ్యముతో హరిపరుఁడై యుండఁగా నీతని శత్రువుల నెవరునిరసించుచుండిరనుటకుసమాధానము చెప్పుచున్నాఁడు.

వ. అంతఁ గొంతకాలంబున కమ్మేదినీకాంతుండు సంసారంబు వలని తగులంబు విడిచి నిర్మలుండై యేకాంతంబున భక్తి పరవశుండై యుండ నారాచతపసికి భక్తవత్సలుం డగు పురుషోత్తముండు ప్రతిభటశిక్షణంబును నిజజనరక్షణం బును నిఖిల జగదవక్రం బగుచక్రంబిచ్చి చనియె నంత. 9

టీ. అంతన్ = పిమ్మట, కొంతకాలంబునకున్ = కొంతకాలము జరుగఁగా, ఆమేదినీకాంతుండు = ఆ యంబరీషమహారాజు, సంసారంబువలని తగులంబును=సంసారమునందలి యభిలాషను, విడిచి, నిర్మలుండై=కల్మషము లేనివాఁడై, భక్తిపరవశుండై = విష్ణుభక్తిచే దేహము మఱచినవాఁడై, ఏకాంతంబునన్=నిర్జనప్రదేశమునందు, ఉండన్=ఉండఁగా, భక్తలోకవత్సలుండును = తనయందు భక్తిచేసిన జనులపై వాత్సల్యము గలవాఁడు, అగు పురుషోత్తముండు=అగునట్టి శ్రీమన్నారాయణుఁడు, ప్రతిభటశిక్షణంబును= శత్రులగర్వ మణఁచునదియు, నిజజనరక్షణంబును=తనకు భక్తులైన జనులఁ గాపాడునదియుఁ, నిఖిలజగత్ అవక్రంబును - సమస్త ప్రపంచమునందును వ్యర్థముకానిదియు, అగు చక్రంబును = అగునట్టి తనచక్రాయుధమును, ఆరాచతపసికిన్=రాజుగానుండియు ఋషియైయున్న యాయంబరీషునికి, ఇచ్చి, చనియెన్=మరలిపోయెను (తనలోకమున కని శేషము). అంతన్=పిమ్మట.

తా. తన కిట్లుసంసారముపై నభిలాషవదలి కొంతకాలము కడచిన పిమ్మట నొకనాఁ డంబరీషుఁ డేకాంతమునఁ గూర్చుండి నిర్మలహృదయముతో భగవద్భక్తిచేయుచు దేహము మఱచియుండెను, అపుడు శ్రీమన్నారాయణుఁ డతని భక్తికిమెచ్చి యధిక వాత్సల్యముగలవాఁడై శత్రులగర్వ మణఁచునదియు శిష్టుల రక్షించునదియు నెచ్చటను దనకార్యములను వ్యర్థపఱచుకొనక సాధించుకొనునదియు నగు తన చక్రాయుధము నా భక్తుని కిచ్చి మరలిపోయెను.

అని విష్ణుచక్ర మంబరీషుని శత్రువును నిరసించిన విధమును జెప్పఁ దలఁచి దాని ప్రస్తావనకై పూర్వకథనుండి ప్రారంభించి చెప్పుచున్నాఁడు.

క. తనతోడి నీడకై వడి
ననురూపగుణాఢ్య యైనయాత్మమహిషితో
జనవిభుఁడు ద్వాదశీవ్రత
మొనరఁగ హరిఁ గూర్చి చేసె నొకయేఁ డధిపా. 10

టీ. అధిపా=ఓ పరీక్షిన్మహారాజా! (వినుము = అని శుకబ్రహ్మర్షి మాట) జనవిభుఁడు = అంబరీషమహారాజు, తనతోడి నీడకై వడిన్=తనవెంబడివదలకవచ్చెడి తననీడవలె, అనురూపగుణాఢ్య=తన గుణములకు సమానమైన గుణములతో నిండినది, ఐన, ఆత్మమహిషితో = ఐనట్టితనపట్టపురాణితో, ద్వాదశీవ్రతము = ప్రతిద్వాదశినాఁడును జేసెడిపారణయనెడి వ్రతమును, ఒనరఁగన్ = చక్కఁగా; సాంగముగా, ఒకయేఁడు = ఒక సంవత్సరకాలము, హరిఁగూర్చి=శ్రీవిష్ణుమూర్తి నుద్దేశించి చేసెను.

తా. అంబరీషమహారా జెంతగుణశాలియో యాయనభార్యయు నంతటి గుణవంతురాలు. ఎట్టికార్యములందుఁగాని యామె తనభర్తను నీడవలె ననుసరించియుండును అట్టిభార్యతో నారాజొకప్పుడు ద్వాదశీపారణ యనునట్టి యొక వ్రతమును శ్రీవిష్ణుమూర్తిప్రీత్యర్థమై సాంగముగా నొక సంవత్సరకాలము ప్రతిద్వాదశియుఁ జేయ నారంభించెను.

వ. ఇట్లు వ్రతంబు సేసి యావ్రతాంతంబున గార్తికమాసంబున మూఁడురాత్రు లుపవసించి కాళిందీజలంబుల సుస్నాతుండై మధువనంబున మహాభిషేకవిధానంబున విహితపరికరసంపన్నుండై హరి నభిషేకంబు సేసి మనోహరంబు లైనగంధంబులు సమర్పించి యభినవామోదంబు లైన పుష్పంబులం బూజించి తదనంతరంబ. 11

టీ. ఇట్లు = క్రిందఁ జెప్పినరీతిగా, వ్రతంబు=ద్వాదశీపారణావ్రతమును, చేసి, ఆవ్రతఅంతంబునన్ = ఆవ్రతము ముగియునపుడు, కార్తిక

మాసంబున, (ఆరా జీవ్రతమును గా ర్తికమాసమున జేయ ప్రారంభించెనని దీనిచే సూచితము.) మూఁడురాత్రులు = నవమిదశమియేకాదసు లనెడి మూఁడుదినములు, ఉపవసించి=ఉపవాసముచేసి (పస్తుండి) (దశమినాఁటి రాత్రియు ద్వాదశిరాత్రియు నేకాదశి పూర్తిగను నుపవాసముచేయుటయే మూఁడురాత్రు లుపవసించుట యని మఱికొందఱు చెప్పుదురు.) కాళిందీ జలంబులన్ = యమునానదీతీర్థములందు, సుస్నాతుండై=శాస్త్రోక్తముగాఁ జక్కఁగా స్నానముచేసినవాఁడై, శుక్లపక్షద్వాదశినాఁడనిశేషము. విహిత పరికర సంపన్నుండై-విహిత = శాస్త్రమునందుఁ జెప్పఁబడిన, పరికర = (అభి షేకమునకుఁగావలసిన) వస్తువులతో, సంపన్నుండై=పూర్ణతనొందినవాఁడై, మహాభిషేకవిధానంబునన్ = సహస్రకలశాభిషేక ప్రకారముగా, మధువ నమ్మునన్ = మధువనమునందు (ఉండెడి), హరిన్=శ్రీవిష్ణుమూర్తిని; అభి షేకంబుసేసి, మనోహరంబులు = సువాసనచే మనస్సు నాకర్షించునవి, ఐ. గంధంబులు=ఐనట్టి శ్రీగంధములను; సమర్పించి, అభినవ ఆమోదంబులు= (ప్రొద్దే పూచియున్న వగుటచేత) క్రొత్తసువాసనగలవి. అయిన పుష్పంబు లన్=అయినట్టి పుష్పములతో పూజించి, తదనంతరంబు అ = ఆవెంటనే.

తా. అంబరీషుఁ డీవ్రతమును గార్తికమాస శుక్లపక్ష ద్వాదశినాఁ డారంభించి యదిమొదలు నొకసంవత్సరకాల మనుష్ఠించి యావ్రతసమాప్తి కాలమున మరలఁ గార్తికమాసము రాఁగా నందు మూఁడుదినము లుపవాస ము చేసి శుద్ధద్వాదశినాఁడు వేకువలేచి యమునానదికిఁ బోయి సమంత్రక ముగా నందు స్నానముచేసి వస్త్రధారణాదు లొనరించి సహస్రకలశాభిషేక మునకుఁ గావలసిన వస్తువులను సిద్ధపఱుచుకొని మధువనమునకుంబోయి యందున్న శ్రీవిష్ణుమూర్తికి యథావిధిగా సహస్రకలశాభిషేకముచేసి సువా సనగల శ్రీగంధమును సమర్పించి క్రొత్త పూవులుతెచ్చి చక్కఁగా నాస్వా మిని పూజించెను. తోడనే.

శా. పాలేత్రై పఱవంగడగ్గఱుచు, లేఁ బ్రాయంబులన్ రూపముల్
వా మేలైధూర్తలుగాక వెండిగొరిజల్ హేమోరుశృంగంబులుం

క్రాలం గ్రేపులయొత్తునాకుచును రంగచ్ఛాయలై యున్నమం
దాలన్ న్యర్బుదషట్కమిచ్చె విభుఁ డుద్యద్వైదికశ్రేణికిన్.

టీ. పాలు=క్షీరము, ఏఱైపాఱంగన్=ప్రవాహమై పోవుచుండఁగా, దగ్గఱుచున్=తమ దూడలయొద్దకుఁ బరువెత్తిపోవుచు, ఱేఁతప్రాయంబులన్ = క్రొత్తయౌవనములచే, రూపములన్ = ఆకారములు, మేలై=మంచివై, ధూర్తలుగాక = చెడ్డస్వభావము కలవిగాక; సాధువులై, వెండిగొరిజల్=వెండి కవచములతో నలంకరించియున్న డెక్కలును, హేమఉరుశృంగంబులున్=బంగారు కొప్పెలు కట్టును వీనిచే నలంకరించియున్న పెద్ద కొమ్ములును, క్రాలన్ ప్రకాశింపఁగా, క్రేపులయొత్తు=దూడల మెడను: నాకుచును, రంగత్ ఛాయలై = తళతళలాడెడి శరీరకాంతికలవై ఉన్న, ఆలన్=ఉన్నట్టియొక మందయావులను, న్యర్బుదషట్కము=ఆఱు న్యర్బుదముల సంఖ్యగలవానిని, విభుఁడు=అంబరీషమహారాజు, ఉద్యత్ వైదిక శ్రేణికిన్=అచ్చటఁ గనఁబడుచున్న వైదిక బ్రాహ్మణసమూహమునకు ఇచ్చెను.

తా. అంబరీషమహారాజు తన యావులమంద నచ్చటికి రప్పించెను. అందొక్కొక్క యావును మిక్కిలి సాధువైనది. మిగులఁ జక్కనిది. క్రొత్తవట్టె యీతది. కావునఁ దన పొదుగునుండి పాలు తనంతటనే ప్రవాహమై పోవుచుండఁగాఁ దన దూడయొద్దకుఁ బరువెత్తుచున్నది. అట్టి యావులకొమ్ములకు గొప్పెలు మొదలగు బంగారు సొమ్ములతోను, గిట్టలను వెండికడ్డితొడుపులను మొదలగు సొమ్ములతోను నలంకరింపించి యట్టి యాఱున్యర్బుదముల యావులను వానిదూడలతో నచ్చటికి వచ్చిన ప్రతివైదికబ్రాహ్మణునకును దానము చేసెను.

క. పెక్కండ్రు విప్రవరులకుఁ
గ్రక్కున నతిభక్తితోడఁ గడుపులు నిండన్
జొక్కపు టన్నంబిడి విభుఁ
డొక్కెడఁ బారణముసేయ నుద్యోగించెన్.

టీ. విభుఁడు = అంబరీషమహారాజు, పెక్కండ్రు = అనేకులైన, విప్రవరులకుఁ=బ్రాహ్మణోత్తములకు, అతిభక్తితోఁ = మిక్కిలిభక్తితో, చొక్కము అన్నంబు = పరిశుద్ధమైనయన్నమును, కడుపులునిండఁ=చాల దృప్తియగునట్లు, క్రక్కునఁ=శీఘ్రముగా, ఇడి=పెట్టి (పిదప వారి యనుమతినొంది), ఒక్కఎడఁ = ఒక్కచోట; కూర్చుండి, పారణము సేయఁ=భుజించుటకు, ఉద్యోగించెఁ=ప్రయత్నించెను.

తా. పిమ్మట నారాజు మిక్కిలి భక్తితో ననేకబ్రాహ్మణులకు జాలఁ దృప్తియగునట్లు శీఘ్రముగా మంచి భోజనముపెట్టించి వారు భుజించిన పిమ్మట వారియొద్ద నుత్తరవుచెంది తానొకచోఁ గూర్చుండి పారణముచేయఁ బ్రయత్నించెను.

వ. అయ్యవసరంబునఁ. 14

టీ. ఆయ్యవసరంబున=ఆరాజు భోజనమునకారంభించుసమయమునందు.

క. భాసుర నిగమపదోప
న్యాసుఁడు సుతపోవిలాసుఁ డనుపమయోగా
భ్యాసుఁడు రవిభాసుఁడు దు
ర్వాసుం డేతెంచెఁ దన్నివాసంబునకుఁ. 15

టీ. భాసుర...ఉపన్యాసుఁడు-భాసుర = ప్రకాశించెడి := (మఱియొక వేగిరము వేగిరముజ్జ్వలించెడి), నిగమపద=వేదములోని పదములను, ఉపన్యాసుఁడు = స్పష్టముగఁ జెప్పువాఁడును, సు తపః విలాసుఁడు = మంచి తపస్సు క్రీడగాఁగలవాడును, (గొప్పతపస్సైనను ననాయాసముగాఁజేయు వాఁడును), అనుపమయోగ అభ్యాసుఁడు = సాటిలేకుండునట్లు యోగము నభ్యసించినవాఁడును (కనుకనే), రవిభాసుఁడు=సూర్యునివలెఁ బ్రకాశించు వాఁడు (అగు దుర్వాసుండు). తత్ నివాసంబునకుఁ=(ఆయంబరీషుండు) నివసించుచోటికి, ఏతెంచెను=వచ్చెను.

తా. అంత మహాతపస్సంపన్నుఁడును, గొప్పయోగియును, దనబ్రహ్మ వర్చస్సుచే సూర్యునివలె వెలుఁగుచున్న దుర్వాసమహర్షి వేదములనుబట్టిగాఁ

జెప్పుకొనుచు వచ్చి యంబరీషుఁడు పారణమునకై ప్రయత్నించునప్పు డచ్చటి కతిథిగా వచ్చి చేరెను.

వ. వచ్చిన నమ్మునివరునకుఁ బ్రత్యుత్థానంబు సేసి కూర్చుండ గద్దియ యిడి పాదంబులు గడిగి పూజించి సేమంబరసి తన యింట నన్నంబు గుడువుమని నమస్కరించిన నమ్మహాత్ముండు సంతసించి భోజనంబునకు నంగీకరించి నిర్మలంబులగు కాళిందీజలంబులం బరమధ్యానంబు సేయుచు మునింగి లేచి రాక తడవు సేసిన ముహూర్తార్ధావశిష్ట యగు ద్వాదశియందుఁ బారణ సేయవలయుటఁ జింతించి బ్రాహ్మణాతిక్రమణదోషంబునకు శంకించి విద్వజ్జనంబుల రావించి వారల నుద్దేశించి 16

టీ. వచ్చినన్ = రాఁగా, అమ్మునివరునకున్ = ఋషిశ్రేష్ఠుఁడైన యాదూర్వాసునికి, ప్రత్యుత్థానంబుసేసి = ఎదురుగాఁబోయి (అతఁడు), కూర్చుండన్ = కూర్చుండుటకు, గద్దియ=ఆసనమును, ఇడి=వేసి, పాదంబులుగడిగి=పూజించి, సేమము అరసి = (ఋషులకుఁ దగిన) క్షేమవృత్తాంతము విచారించి, తనయింటన్ = అంబరీషుని యింటియందు, అన్నంబు, కుడువుము=భుజింపుము. అని నమస్కరించినన్ = నమస్కారము చేయఁగా, ఆమహాత్ముఁడు = గొప్పప్రభావముగల యాదూర్వాసుఁడు, సంతసించి = సంతోషపడి, భోజనమునకున్=పారణచేయుటకు, అంగీకరించి=ఒప్పుకొని, నిర్మలంబు=కల్మషములేనిది, అగు కాళిందీజలంబులన్=అగునట్టి యమునానదీ తీర్థమునందు, పరమధ్యానంబు సేయుచున్=పరమాత్మను ధ్యానించుచు, మునిఁగి=స్నానముచేసి, లేచిరాక, తడవుసేసినన్ = ఆలస్యము చేయఁగా, ముహూర్త అర్థ అవశిష్ట=ఒకగడియ కాలము శేషించియున్నది అగు ద్వాదశియందున్=అగునట్టి ద్వాదశి తిథిలోఁ (రెండుగడియలొకముహూర్తము-అందు సగమొకగడియ.) పారణ సేయవలయుటన్ = పారణ సేయవలసినట్లు తటస్థించుటను, చింతించి = ఆలోచించి, బ్రాహ్మణ అతిక్రమణదోషంబునకున్=బ్రాహ్మణునికి పెట్టకముందుగా భుజించుటవలని యపచారమునకు,

శంకించి=భయపడి, విద్వత్ జనంబులన్=అనేకవిద్వాంసులను, రావించి=రప్పించి, వారల నుద్దేశించి=ఆవిద్వాంసులనుఁ గూర్చి (ఇట్లనియె).

తా. అంబరీషుఁ డట్లువచ్చిన దూర్వాసమహర్షి నెదుర్కొనిపోయి పిలుచుకొనివచ్చి బ్రాహ్మణులకుందగిన యొక యాసనమునఁ గూర్చుండఁ బెట్టి యర్ఘ్యపాద్యాచమనీయముల నిచ్చి పూజించి, మీతపస్సు చక్కఁగ నెఱవేఱుచున్నదా! మీయాగములు నెఱవేఱుచున్నదా! యని వారిని కుశలప్రశ్నము లడిగి తనయింట నాఁడు పారణముచేయునట్లు నమస్కరించి ప్రార్థించెను. ఆమహర్షియు సంతోషముతో నట్లే యొప్పుకొని మాధ్యాహ్నికానుష్ఠానమునకై యమునానదికిఁ బోయి యందు నీటిలో మునిఁగి పరమాత్ముని ధ్యానించుచు మైమఱచి చాలసేపు దాఁక రాకుండెను. అప్పుడు ద్వాదశి యొకగడియమాత్రము మిగిలియుండెను. ఇంకను ఋషి రాలేదే, ఈశేషించియున్న ద్వాదశిగడియలోనైనను పారణ యగునా యని యప్పు డంబరీషుఁడు విచారపడి బ్రాహ్మణుని మీఱి ముందుగాఁ బారణముచేసినచో మహాపచారము కలుగునని భయపడుచు నేమియుఁ జేయఁదోఁపక గొప్పవిద్వాంసుల రప్పించి వారలతో నిట్లనియె.

క. ముని నీరుసొచ్చి వెడలఁడు
చనియెడు ద్వాదశియు నింతఁ జనకయె యీలో
నన పారణ సేయవలయు
వినిపింపుం డర్హధర్మ విధమెట్టిదియో. 17

టీ. ముని=దూర్వాసమహర్షి! నీరుసొచ్చి=నీటిలో మునిఁగి, వెడలఁడు=లేచిరాఁడు, ద్వాదశియు=ద్వాదశితిథియు, చనియెడున్ = గడచిపోవును. ఇంతన్=ఈశేషించియున్న ద్వాదశిగడియ యైనను, చనకయె=కడవకయే, ఈలోనన్=ఈమధ్యకాలమునందె, పారణ సేయవలయు=భోజనము సేయవలెను. అర్హ ధర్మ విధము = ఇప్పటికిఁదగినదియు న్యాయమైనదియు నగువిధము, ఎట్టిదియో, వినిపింపుఁడు=(నాకుఁ) దెల్పుఁడు.

తా. ఓవిద్వాంసులారా! మనయింటఁ బారణమునకై నేను బిలిచిన దూర్వాసమహర్షి స్నానార్థమై పోయి నీటిలో మునిఁగి యింకను లేవనే లేదు. ద్వాదశిగడియలన్నియు దాఁటిపోయినవి. ఈశేషించియున్న ద్వాదశిగడియ గడవక

ముందైనను నాకుఁ దప్పక పారణసేయవలయును. ఆయన రాకమునుపు పారణ చేయుటయుఁ దప్పుగదా! ప్రకృత మెట్లు నడచుకొన్నచో నా వ్రతము భంగము కాదో, ఋషివిషయమై యపచారము సంభవింపదో, అట్టి యుక్తమైన ధర్మమార్గము నాకుఁ జెప్పుఁడు.

వ. అని పలుకు రాజునకు బుధజను లిట్లనిరి. 18

టీ. అని=ఈరీతిగా, పలుకు రాజునకున్=అడుగుచున్న యంబరీషునికి, బుధజనులు=పండితులు, ఇట్లు=పైఁ జెప్పబోవు రీతిగా, అనిరి=ప్రత్యుత్తరమిచ్చిరి.

ఆ. అతిథి పోయి రామి నధిప యీ ద్వాదశీ
పారణంబు మానఁ బాడిగాదు
కుడువకుంట గాదు కుడుచుటయును గాదు
సలిలభక్షణంబు సమ్మతంబు. 19

టీ. అధిప=ఓరాజా! అతిథి=భోజనమునకై పిలువఁబడిన దూర్వాసుఁడు, పోయి=స్నానమునకై పోయి, రామిన్=ఇంతసేపు రాకుండుట మాత్రముననే, ఈద్వాదశీపారణంబు= ద్వాదశిగడియలలోఁ జేయఁ దగిన యీ పారణము, మానన్=వదలుట, పాడిగాదు=యుక్తము కానేరదు. కుడువకుంట=పారణము చేయకుండుట, కాదు=కానేరదు. కుడుచుటయు=భోజనము చేయుటయును, కాదు. సలిలభక్షణంబు=నీరుపారణ చేయుట, (కాననిదియే), సమ్మతంబు=ఇష్టమైనది.

తా. ఓరాజా! అతిథి రాలేదన్నంతమాత్రమునకే యీ పారణావ్రతమును నీవు చెడఁగొట్టుకొనుట యుక్తముగాదు. అందులకై నిన్ను ముందుగా భుజింపుమని చెప్పము. నీటితోఁ బారణము చేయుము. ఇది భోజనముతోను జేరదు. ఉపవాసముతోను జేరదు. కాన దీనిచే నీకతిథినిమిత్తమైన దోషమును రాదు. నీ వ్రతభంగము కాదు. ఇదియే మాకిప్పటికిం దోఁచిన ధర్మము.

వ. అని ధర్మసందేహంబు వాపిన నా రాజర్షిశ్రేష్ఠుండు మనంబున హరిం దలంచి నీరపారణంబు సేసి జలంబుల మునిఁగిన తపసిరాక కెదురుచూచుచున్న సమయంబున. 20

ముంకైనను నాపఁ దప్పక పారణసేయవలయును. ఆయనరాక ముందు పారణ చేయుటయుఁ దప్పుగదా! ప్రకృత మెట్లువడచుకొన్నచో నా వ్రతము భంగ ముకాదో, ఋషివిషయమై యపచారముసంభవింపదో, అట్టియుక్తమైన ధర్మ మార్గమును నాకుఁ జెప్పుఁడు.

వ. అని పలుకురాజునకు బుధజను లిట్లనిరి. 18

టీ. అని=ఈరీతిగా, పలుకురాజునకున్=అడుగునట్టి యంబరీషునికి, బుధ జనులు=పండితులు, ఇట్లు=పైఁజెప్పబోవురీతిగా, అనిరి=ప్రత్యుత్తరమిచ్చిరి.

ఆ. అతిథిపోయి రామినధిప యీద్వాదశి
పారణంబుమానఁ బాడిగాదు
కుడువకుంటగాదు కుడుచుటయునుగాదు
సలిలభక్షణంబు సమ్మతంబు. 19

టీ. అధిప=ఓరాజా! అతిథి=భోజమునకై పిలువఁబడినదూర్వాసుఁడు, పోయి=స్నానమునకై పోయి, రామిన్=ఇంతసేపురాకుండుట మాత్రముననే, ఈద్వాదశిపారణంబు= ద్వాదశిగడియలలోఁ జేయఁ దగినయీపారణము, మానన్=విడలుట, పాడిగాదు=యుక్తముకానేరదు. కుడువకుంట=పారణముచే యకుండుట, కాదు=కానేరదు. కుడుచుటయు=భోజనముచేయుటయు, కాదు. సలిలభక్షణంబు=నీరుపారణచేయుట, (కాననిదియే), సమ్మతంబు=ఇష్టమైనది.

తా. ఓరాజా! అతిథిరాలేదన్నంతమాత్రమునకే యీ పారణావ్రత మును నీవు చెడఁగొట్టుకొనుట యుక్తముగాదు. అందులకై నిన్ను ముందుగా భుజింపుమని చెప్పము. నీటితోఁ బారణముచేయుము. ఇది భోజనముతోను జేరదు. ఉపవాసముతోను జేరదు. కాన దీనిచే నీకతిథినిమిత్తిన దోషమును రాదు. నీవ్రతభంగముకాదు. ఇదియే మాకిప్పటికిం దోఁచినధర్మము.

వ. అని ధర్మసందేహంబు వాపిన నారాజర్షిశ్రేష్ఠుండు మనం బున హరిం దలంచి నీరపారణంబుసేసి జలంబుల మునింగిన తపసిరాక కెదురుచూచుచున్న సమయంబున. 20

టీ. ధర్మసందేహము=ఎట్లుచేసినధర్మమగునో యనునట్టి తనసందేహమును, అని=ఈక్రిందజెప్పినట్లు, వాపినన్=తొలఁగింపఁగా, ఆరాజర్షిశ్రేష్ఠుండు=ఆయంబరీషుఁడు, మనంబునన్=మనస్సునందు, హరిన్, తలంచి=ధ్యానముచేసి, (విద్వాంసులమాటమీఁద నేనుజేయు నీకార్యము సరియైనను దప్పైనను నీవే క్షమింపవలెనని శ్రీవిష్ణుమూర్తిని బ్రార్థించి)నీరపారణంబుచేసి=నీటినిద్రాగి, జలంబులన్=యమునాతీర్థమునందు, మునింగిన తపసిరాకకున్=మునిఁగియున్న దూర్వాసుఁడువచ్చుటకు, ఎదురుచూచుచున్న సమయంబునన్=కాచుకొనియున్న కాలమున.

తా. అనిచెప్పి విద్వాంసు లారాజు ధర్మసందేహమును దీర్చిరి. అంత రాజెంతటివారికైనను ధర్మసూక్ష్మము తెలియుట యసాధ్యము కానఁ దానుజేసెడి కార్యమొకప్పుడు తప్పైనచోఁ దన్ను క్షమించునట్లు శ్రీవిష్ణుమూర్తిని ధ్యానించి ప్రార్థించుచు దనద్వాదశీపారణా వ్రతమును నీటితోఁ బూర్తిచేసికొనెను. ఆపిమ్మట నీటిలోమునిఁగియున్న దూర్వాసుఁ డెప్పుడువచ్చునా యని కాచుకొనియుండెను. అట్టిసమయంబున.

సీ. యమునలోఁ గృతకృత్యుఁ డై వచ్చిరాజుచే
సేవితుం డై రాజుచేష్టితంబు
బుద్ధిలో నూహించి బొమముడి మొగముతో
నదరెడి మేనితో నాగ్రహించి
రెట్టించి యాఁకలి గొట్టుమిట్టాడంగ
నీసంపదున్మత్తు నీనృశంసు
నీదురహంకారు నిందఱుఁ గంటిరే
విష్ణుభక్తుఁడుగాఁడు వీఁడునన్నుఁ
తే. గుడువరమ్మని మునుముట్టఁగుడిచినాఁడు
ధర్మభంగంబుచేసి దుష్కర్ముఁ డయ్యె
నయిన నిప్పుడచూపెద నన్నిదిశల
నేనుగోపింప మాన్పువాఁ డెవ్వఁడనుచు. 22

టీ. (పైపద్యములోనిమునీంద్రుఁడను పదము నిచ్చటఁ గర్తగాఁ దీసికొనవలెను) మునీంద్రుఁడు=దూర్వాసుఁడు, యమునలోన్ = యమునానదియందు, కృతకృత్యుఁడై=తనయనుష్ఠానమును నెఱవేర్చుకొన్నవాఁడై, వచ్చి=(రాజునివసించుచోటికి)వచ్చి, రాజుచే=అంబరీషునిచే, సేవితుండై=నమస్కరింపఁబడినవాఁడై, రాజుచేష్టితంబు=తానురాకముందే యంబరీషుఁడు నీటిపారణముచేయుటను, బుద్ధిలో ఊహించి = బుద్ధియందాలోచించి తెలిసికొని, బొమముడిమొగముతోన్=(కోపముచే) వంకరలైన కనుబొమ్మలుగల మొగముతోను, అదరెడిమేనితోన్ = కంపించుచున్నశరీరముతోను (కూడినవాఁడై), ఆగ్రహించి=కోపించి, ఆఁకలిరెట్టించి=(కోపముచేత) అధికమై,కొట్టుమిట్టాడంగన్=బాధింపఁగా, ఈ, సంపత్ ఉన్మత్తున్=ఐశ్వర్యముచేతమదించినవీనిని, ఈనృశంసున్=ఈక్రూరుని, ఈదురహంకారుని=(తానే గొప్పప్రభుఁడని) యహంకారమునొందిన యీ యంబరీషుని, ఇందఱున్ = ఇచ్చటనున్నమీరందఱును, కంటిరే=చూచితిరా! వీఁడు=అంబరీషుఁడు, విష్ణుభక్తుఁడు=శ్రీవిష్ణుమూర్తిపై వాస్తవభక్తికలవాఁడుగా, కాఁడు = కానేరఁడు (ఏలయన), నన్నున్=ఋషిశ్రేష్ఠుఁడైన నన్ను, కుడువన్=భోజనముచేయుటకు, రమ్మని (పిలిచి), మునుముట్టన్=నేనురాకమునుపే, కుడిచినాఁడు=(తాను) భోజనముచేసినాఁడు (కాఁబట్టి), ధర్మభంగంబుచేసి = ధర్మమార్గమును జెఱిచి, దుష్కర్ముఁడు=పాపి, అయ్యెను. అయినన్=అయినప్పటికిని, ఇప్పుడ=ఈనిమిషముననే, చూపెదను=నాశక్తిని గనఁబఱిచెదను, నేను, కోపింపన్, అన్నిదిశలన్=సమస్తదిక్కులందును, ఎవ్వఁడు, మాన్చువాఁడు=నాకోపము నెదిరించి యణచువాఁడు, అనుచున్=అనిచెప్పుచు.

తా. అంతననుష్ఠానమునకై పోయియున్నదూర్వాసమహర్షి తనయనుష్ఠానముతీర్చికొని యంబరీషునినివాసమునకువచ్చి, తనకై కాచుకొనియున్న రాజు లేచి వచ్చి తన్ను నమస్కరింపఁగాఁ జూచి, యతఁడు తనకుముందుగాఁ బారణముచేసినసంగతి నారాజునడతనుబట్టి యూహించి తెలిసికొని యతనిపై మిక్కిలి కోపపడెను. అంత ఋషిమొగము చిటమటపడ నాతం

భించినది. శరీరము కంపమునొందినది. ఆకోపమున కాఁకలి మఱింతయధికమైనది. ఋషి యట్లు మిక్కిలి యాగ్రహపడి యచ్చటనున్న జనులతో నారాజును గూర్చి, ఓజనులారా! యీరాజు కూరస్వభావుఁడు. తానే గొప్పసంపన్నుఁడనియు గొప్పప్రభుననియు నహంకారపడుచున్నాఁడు. నేఁడు ద్వాదశి యని నన్నుఁ బారణకై పిలిచి నేనురాకమునుపే వీఁడు పారణ ముగింపఁగొన్నాఁడు. ఇట్లు పెద్దల నవమానించి యధర్మముచేసినవీఁడు మహాపాపియేకాని వాస్తవమైనవిష్ణుభక్తుఁడగునా! నాకుఁగోపమువచ్చెనేని యీలోకమందెవ్వరు గాని యణఁపలేరు. అట్టినాశక్తిని వీఁడు తెలిసికొనలేదు కాఁబోలు. కానీ, నాశక్తిచూపి వీనిపొగరణంచెదను. అనిచెప్పెను.

చ. పెటపెటఁ బండ్లుగీఁటుచును భీకరుఁడై కనుఁగ్రేవనిప్పుకల్
పొటపొటరాలగండములుపొంగ మునీంద్రుఁడువాఁకరించుచున్, జటమొదలంటఁగాఁ బెఱికి చక్కనదానకృత్యనా
యుధో, త్కటవలమానహస్తయుతఁగానొనరించినయించె
రాజుపై. 22

టీ. మునీంద్రుఁడు = దూర్వాసుఁడు, పెటపెటన్ = పెటపెటమని శబ్దముచేయునట్లు, పండ్లుగీఁటుచును=పండ్లుకొఱుకుచు, కనుఁగ్రేవన్=కన్నులలోనుండి, నిప్పుకల్=నిప్పుకణములు, పొటపొటరాలన్ = మిక్కిలియధికముగాఁ బడుచుండఁగా (కన్నులలోనలెజ్జపొఱఁగా), గండములు = కణఁతలు, పొంగన్ = ఉబ్బుచుండఁగా, భీకరుఁడై = భయంకరాకారముకలవాఁడై, హుంకరించుచున్ = హుమ్మనిశబ్దముచేయుచు, జటను = తలలోని యొకజడను, మొదలంటఁగా = అడుగునుండి, పెఱికి=ఊడఁదీసి, దానన్ అ = ఆజడచేతనే, కృత్యన్ = కోపరూపమైన యొకదేవతను, ఆయుధ... యుతఁగాన్ - ఆయుధ = ఖడ్గముతో, ఉత్కట = మిక్కిలి తిరుగుచున్న, హస్త=చేతితో, యుతఁగాన్ = కూడినదానినిగా, చక్కన=తోడనే, ఒన రించి= సృష్టించి, రాజుపైన్, నయించెన్ = పంపెను.

తా. తర్వాత దూర్వాసుఁడు మహాకోపముతోఁ గన్నులెఱ్ఱచేసికొని కంత లదరునట్లు పండ్లు పెటపెటఁ గొఱుకుచు మహాభయంకరాకారుఁడై యుండి హుమ్మని యారాజును బెదరించెను. వెంటనే తనతలనుండియొకజడను మొదలంటఁబెఱికి చేతఁగ త్రిత్రిప్పుచున్న యొకకోపదేవతను సృజించి యత నిపైఁ బ్రేరేపించెను.

వ. అంతన్. 23

టీ. అంతన్ = అటుపిమ్మట.

క. కాలానలసన్నిభయై
శూలాయుధహస్తయగుచు సుఱసుఱస్రుక్కన్
నేలఁబదంబులఁద్రొక్కుచు
వాలిమహాకృత్యమనుజవల్లభుఁ జేరెన్. 24

టీ మహాకృత్య=గొప్పయాకారముగలయాకోపదేవత,కాలఅనిల సన్నిభయై=ప్రళయకాలమందలియగ్నితోసమానమై, శూల ఆయుధహస్త అగుచున్=త్రిశూలాయుధము చేతియందుఁ గలదియగుచు, నేలను = భూమిని, పదంబులన్=అడుగులతో, సుఱసుఱస్రుక్కన్=తల్లడిల్లునట్లు, త్రొక్కుచు, వ్రాలి=విజృంభించివచ్చి, మనుజవల్లభున్=అంబరీషుని చేరెను.

తా. అంత మఱియొకచేతఁ ద్రిశూలము పట్టుకొని భయంకరాకారయగునాకృత్యప్రళయకాలాగ్నివలె మిక్కిలితీవ్రముగామండిపడిభూమితల్లడిల్లునట్లు తనయడుగులతోఁ ద్రొక్కుచు విజృంభించి యారాజునొద్దకుఁ బోయిచేరెను.

ఆ. ఆప్రకార మెఱిఁగి హరి విశ్వరూపుండు
వెఱ్ఱితపసిసేయు వేడబంబు
జక్కఁబెట్టుమనుచుఁ జక్రంబుఁబంచిన
వచ్చెనదియుఁ బ్రళయవహ్నివగిది. 25

టీ. విశ్వరూపుండు = ప్రపంచమంతయుఁ దనయాకారముగాఁ గల వాఁడగు, హరి = శ్రీవిష్ణుమూర్తి, వెఱ్ఱితపసి = అవివేకియైన యాదూర్వాసుఁడు, ఆప్రకారము = ఆతీరున, చేయువేడబంబు = చేయునట్టివికార కార్యమును, ఎఱిఁగి = తెలిసికొని, చక్కఁబెట్టుము = అణఁచివేయుము. అనుచుఁన్, చక్రంబును = చక్రాయుధమును, పంచినన్ = ప్రయోగింపఁగా, అదియును=ఆచక్రాయుధమును, ప్రళయవహ్నిపగిదిన్=ప్రలయకాలపునిప్పువలె (మండిపడుచు) వచ్చెను

తా. శ్రీవిష్ణుమూర్తి ప్రపంచాకారుఁడు గాన నెచ్చటనేదిజరిగినను నాయనకుఁ జక్కఁగఁ దెలియుచుండును. కాఁబట్టి దూర్వాసుఁడట్లు వెఱ్ఱితనముగాఁ జేసిన యాదుస్సాహస్యమును విష్ణుమూర్తి తెలిసికొని యతనియహంకారమునణఁచివేయునట్లు తనచక్రాయుధముతోఁ జెప్పిపంపెను. అదియుఁ బ్రలయకాలాగ్నివలె మండిపడుచు నాదూర్వాసునియెదుటకు వచ్చిచేరెను.

వ. వచ్చి మునిసేసిన కృత్యను దహించి తనవిసనకమునివెంటం
బడిన మునియు మేరుగుహాసొచ్చిన నదియు నురగంబువెను
కొనుదవానలంబుతెఱంగునఁ దోనచొచ్చి మఱియును.26

టీ. వచ్చి = (చక్రముక్త) ముని=దూర్వాసుఁడు, చేసినకృత్యను= సృష్టించినకోపదేవతను, దహించి=కాల్చి, తనివిసనక = (అంతటితోఁ)దృప్తి పడక, మునివెంబంబడినన్=దూర్వాసుని వెంబడింపఁగా, మునియు=దూర్వాసుఁడును (పాఱిపోయి), మేరుగుహన్=మేరుపర్వతములోని యొకగుహను, చొచ్చినన్ = ప్రవేశింపఁగా, అదియును = ఆ చక్రాయుధమును, తోన్ అ=ఆ ఋషివెంబడియే, ఉరగంబును = పామును, వెనుకొను దవానలంబు తెఱంగునన్ = వెంబడించుకాఱుచిచ్చువలె, చొచ్చి = ప్రవేశించి, మఱియును=ఇంకను.

తా. అట్లు వచ్చిన యాచక్రాయుధ మంబరీషునిపై దూర్వాసుఁడు సృజించి పంపినయాకృత్యనుగాల్చి వేసి యంతటితోఁ దృప్తిపడక యాఋషిపైఁబడి తఱిమెను. దానికి భయపడి ఋషియుఁ బరుగెత్తిపోయి మేరు

పర్వతములోని యొకగుహలోఁ బ్రవేశించెను. అదియును వదలక పామును వెంబడించుకార్చిచ్చువలె నాతని దఱుముకొనిపోయి తాను నా గుహనుజొచ్చినది. దూర్వాసునికృత్యముయొక్క తీక్ష్ణతకంటెను జక్రాయుధముయొక్క తీక్ష్ణత యధికమని సూచించుటకై యురగంబు వెనుకొనుదవానలంబు పగిదినని యుపమానము చెప్పెను.

మ. భువిఁ దూఱన్ భువి దూఱు నబ్ధిఁ జొరనబ్ధుల్ సొచ్చును ద్వేగియై
దివిఁ బ్రాకన్ దివిఁ బ్రాఁకు దిక్కులకుఁ బో దిగ్వీథులం బోవుఁ జి
క్కి వెసం గ్రుంగినఁ గ్రుంగు నిల్వ నిలుచుం గ్రేడింపఁ గ్రేడించు నొ
క్కఁడిం దాపసు వెంటనంటి హరిచక్రం బన్యదుర్వక్రమై. 27

ప్ర. హరిచక్రంబు = శ్రీవిష్ణుమూర్తిచక్రాయుధము, అన్యదుర్వక్రమై=ఇతరు లెవ్వరిచేతను నెంత శ్రమపడియు వంకరగాఁ జేయుటకు సాధ్యపడనంత దృఢమైనదై (ఇతరుల కసాధ్యమైనదై), ఒక్కవడిన్ = మిక్కిలి వేగముతో, తాపసువెంటన్=దూర్వాసుని వెంబడి, అంటి = తగిలి, భువిన్ దూఱన్ = (దూర్వాసుఁడు) భూలోకములోఁ దూఱినపుడు, భువిన్ దూఱున్=భూలోకములోఁ బ్రవేశించును. అబ్ధిన్=సముద్రమందు, చొరన్=ప్రవేశింపఁగా, అబ్ధుల్ చొచ్చున్ = సముద్రములలోఁ బ్రవేశించును. ఉద్వేగియై = అధికవేగముకలవాఁడై, (భయముకలవాఁడై, యనికొందఱు.) దివిన్ ప్రాఁకన్ = ఆకాశమునఁబ్రాఁకి పోఁగా, దివిని ప్రాఁకును = ఆకాశమునఁ బోవును. దిక్కులకున్ పోన్=దిక్కు దిక్కులకుఁ బాఱిపోఁగా, దిక్ వీథులన్ పోవును = దిక్కులందు వెంబడించి పోవును. చిక్కి= దగ్గఱఁ దగులుకొని, వెసన్=శీఘ్రముగా, క్రుంగినన్=వంగఁగా, క్రుంగున్=వంగును, నిల్వన్= నిలుచుండఁగా, నిలుచున్= నిలువునమందుచుఁ బైఁబడును. క్రేడింపన్=తొలఁగఁగా, క్రేడించున్=(వాని వెంబడి) తొలఁగును.

తా. శత్రువుల కసాధ్యమైన యావిష్ణుచక్రము భయపడి పాఱిపోవుచున్న యాదూర్వాసుని వెంబడించి మిక్కిలి వేగముగాఁ దఱుముచు నతఁడెచ్చటెచ్చటఁదూఱినను నచ్చటనంత దూఱి యతనిని మిక్కిలి చిక్కుపెట్టెను.

శా. ఏలోకంబునకైన వెంటఁబడి తో నేతెంచుచక్రానల
జ్వాలల్ మానుపువారు లేమిఁ జని లోకజ్యేష్ఠు దేవేశు వాఁ
డాలోకించి విధాత విశ్వజననవ్యాపారపారీణ రే
ఖాలీలేక్షణ చూడవే కరుణఁ జక్రంబు న్నివారింపవే. 28

టీ. ఏలోకంబునకైనన్=ఏలాటిలోకమునకుఁ గాని, వెంటఁబడి=వెంబడించి, తోన్=కూడ, ఏతెంచు, చక్ర, అనల జ్వాలల్=వచ్చుచున్న నిప్పువంటిచక్రాయుధముయొక్క మంటలను, మానుపువారు = అణఁచువారు, లేమిన్=లేకుండుటచేత, వాఁడు = దూర్వాసుఁడు, చని=(బ్రహ్మలోకమునకుఁ)బోయి, లోక ఈశున్ = సమస్తలోకమునకును ప్రభువైనవానిని, దేవజ్యేష్ఠున్=దేవతలలోఁ బెద్దయైన బ్రహ్మదేవుని, ఆలోకించి = చూచి, విశ్వ ...ఈక్షణ-విశ్వ=ప్రపంచమును, జనన=సృష్టిచేయుట యనెడి, వ్యాపార=కార్యమునందలి, పారీణరేఖా=పాండిత్యమే, లీల=క్రీడగాఁ గలిగిన; ఈక్షణ=కటాక్షముకలవాఁడా! విధాత = బ్రహ్మదేవుఁడా! (నిమన్) కరుణన్=దయతో, చూడవే=కటాక్షింపవయ్యా! చక్రంబున్, నివారింపవే=తొలఁగింపవయ్యా.

తా. దూర్వాసుఁ డెచ్చటికిఁ బోయినను జక్రాయుధ మాతని వెంటనంటి నిప్పులు గ్రక్కుచుఁ దఱుముచుండెనే గాని దానిని దొలఁగించి యతనినిగాపాడు నా రెవ్వరును లేరైరి. అంత నతఁ డాలోచించి సత్యలోకమునకుఁ బోయి బ్రహ్మదేవునిఁచూచి, యో బ్రహ్మా! నీవు కొంచెము లీలతోఁ గటాక్షించినంతనే సమస్తప్రపంచసృష్టియు నగును. అంతటిసామర్థ్యముగల నీవు నన్నుఁ గరుణతోఁ గటాక్షించి యీతఱుముకొని వచ్చుచున్న చక్రాయుధమును దొలంగించి నా ప్రాణములు రక్షింపవయ్యా యని ప్రార్థించెను.

వ. అనిన బ్రహ్మ యిట్లనియె 29

టీ. అనినన్=ఇట్లు దూర్వాసుఁడు ప్రార్థింపఁగా. బ్రహ్మ, ఇట్లు=చెప్పఁబోవురీతిగా, అనియెను.

అవ. భగవంతుఁడు తనలీలార్థమై నన్ను సృజించి నాకు సర్వలోకాధిపత్యము నిచ్చియున్నాఁడు. అతని కిట్లు పరతంత్రుఁడనైయున్న నే నతని చక్రాయుధమును దొలఁగింపలేనని బ్రహ్మ చెప్పుచున్నాఁడు.—

మ. కరమర్థిన్ ద్విపరార్ధసంజ్ఞ గలయీకాలంబుఁ గాలాత్ముఁ డై
సొరిదిన్ నిండఁగఁ జేసి లోకములు నాచోటున్ విభుం డెవ్వఁడో
పరిపూర్తిం గనుఁగ్రేవఁ గెంపుగొలుపన్ భస్మంబులై పోవునా
హరిచక్రానలకీలకన్యుఁ డొకరుం డడ్డంబు గా నేర్చునే. 30

టీ. విభుఁడు = జగదీశ్వరుఁడైన, ఎవ్వఁడు=ఏవిష్ణుమూర్తి, కాలాత్ముఁడై=కాలస్వరూపుఁడై (కాలమునకు నంతర్యామియై), కరము=మిక్కిలి, అర్థిన్=వేడుకతో, ద్విపరార్ధసంజ్ఞ = ద్విపరార్ధమనెడిపేరు, కలయీకాలంబును=కలిగిన యీ ప్రపంచము నుండెడి కాలమును, సొరిదిన్=క్రమముగా, నిండఁగఁజేసి=నిండించి, కనుఁగ్రేవన్ = (తన) కన్నుల కొనలను, కెంపు=ఎఱ్ఱని కాంతిని, కొలుపన్=కొనునట్లు చేయఁగా (లోకముపైఁ గొంచెము కోపపడి చూడఁగా,) నాచోటు=నేనుండెడి సత్యలోకమును, లోకములు=ఇతరలోకములను, పరిపూర్తిన్ = అంతయును, భస్మంబులై పోవును = బూడిదలై పోవునో, ఆ హరి...కీలకున్ - ఆ హరి చక్ర=ఆవిష్ణుమూర్తి చక్రాయుధమనెడి, అనల=నిప్పుయొక్క, కీలకున్=మంటకు, అన్యుఁడొకరుండు=ఇతరుఁడొకఁడైనను, అడ్డంబుగా నేర్చునే=ఆటంకపడనగునా, (కానేరఁడు.)

తా. శ్రీవిష్ణుమూర్తి కాలస్వరూపుఁడై యుండి నా జన్మము మొదలు నాయాయుష్కాలమంతయుఁ బూర్తియగువఱకు నీలోకసృష్టియనెడి లీలననుభవించుచుండి యా కాలము పూర్తి కానిచ్చి సమస్తలోకములను గొంచెము కోపదృష్టితోఁ జూచును. అంత నా యున్న సత్యలోకమును నితరలోకములును భస్మమై పోవును. ఇట్లు మా జననమరణములు శ్రీవిష్ణుమూర్తి యాజ్ఞానుసారమై జరుగుచుండఁగా నతని చక్రాయుధమును మే మెట్లు తొలఁగింపఁ గలుగుదుము.

(బ్రహ్మయొక్క జీవితకాలము బ్రహ్మకాలమాన ప్రకారము.నూరేండ్లు. ఆదంతయుఁ జేరి పరార్ధమనఁబడును. అందు మొదటి యేఁబదియేండ్లు మొదటిపరార్ధ మనఁబడును. రెండవయేఁబది రెండవపరార్ధమనఁబడును. (అట్టి రెండు విధములగు పరార్ధములును నిటఁదెలియునది )

అవ. "అన్యుఁడొకరుం డడ్డంబుగా నేర్చునే" యనుదానిని వివరించి చెప్పుచున్నాఁడు.—

అ. ఏనుభవుఁడు దక్షుఁ డింద్రాదులును బ్రజా
పతులుభృగుఁడు భూతపతులుశిరము
లందుఁదాల్తు మతనియాజ్ఞ జగద్ధితం
బంచుభూరికార్య మతుల మగుచు. 31

టీ. ఏను=బ్రహ్మ, భవుఁడు = శివుఁడు, దక్షుఁడు = దక్షప్రజాపతి, భృగుఁడు=భృగుమహర్షి, ప్రజాపతులు=దక్షభృగులు దప్పఁదక్కినయుప ప్రజాపతులును, ఇంద్రాదులును=ఇంద్రుఁడు మొదలగు దిక్పాలురును, భూతపతులును = పదునొకండుగురు రుద్రాదులును (మేమందఱమునుజేరి), జగద్ధితంబంచుఙ్=లోకములకన్నిటికిని మేలని, భూరి కార్య మతులము అగుచుఙ్ = గొప్పకార్యములను జేయఁదలంచినవారమై, ఆతనియాజ్ఞఙ్=ఆశ్రీవిష్ణుమూర్తియుత్తరువును, శిరములందుఁ దాల్తుము=శిరసావహింతుము.

తా. బ్రహ్మలలోఁ బెద్దనగు నేనును, ఉపబ్రహ్మలని నాకుసహాయులుగానున్న దక్షాదులును, ఇంద్రాదిదిక్పతులును, శివుఁడును, ఆయనకు సహాయులగుపదునొకండుగురురుద్రులును వను మేమందఱమును గూడి శ్రీవిష్ణుమూర్తియాజ్ఞను శిరసావహించి యదియే లోకములకెల్ల శుభప్రదమని యెంచి తదనుసారముగనే సమస్తకార్యములను జేయుచున్నారము.

వ. కావున సుదర్శననివారణంబునకు నోపననివిరించి పలికిన దుర్వాసుండు కైలాసంబునకుం జనుదెంచి శర్వునాలోకించి చక్రిచక్రానుసారంబు తెఱంగెఱింగించిన నమ్మహాదేవుం డిట్లనియె. 32

టీ. కావునన్=సుదర్శననివారణంబునకుం = చక్రాయుధమును దొలఁగించుటకు, ఓపను = శక్తుఁడనుగాను, అని, విరించి = బ్రహ్మ, పలికినన్= చెప్పఁగా. దుర్వాసుండు, కైలాసమునకున్ = కైలాసపర్వతమునకు, చను దెంచి=పోయి, శర్వున్=ఈశ్వరుని, ఆలోకించి=చూచి, చక్రిచక్ర అను సారంబు తెఱంగు = శ్రీవిష్ణుమూర్తి చక్రాయుధము తన్ను వెంబడించి తఱుముకొనివచ్చెడివిధమును, ఎఱిఁగించినన్ = తెలుపుకొనగా, ఆ మహా దేవుండు=ఆ పరమశివుఁడు. ఇట్లు = చెప్పఁబోవురీతిగా, అనియె.

తా. చక్రాయుధమును దొలఁగింపఁ దనకుఁ జేతఁగాదని బ్రహ్మచెప్పి నమీఁదట దుర్వాసుఁడు కైలాసమున నీశ్వరుని సన్నిధానమునకుంబోయి తన్ను విష్ణుచక్రాయుధము తఱుముకొని వచ్చుచున్న విధమునంతయుఁ జెప్పెను. అది విని పరమేశ్వరుఁడు దూర్వాసునితో ని ట్లనెను.

అవ. చక్రాయుధమును దొలఁగింపఁ దనకు శక్తిలేదని శివుఁడు చెప్పఁ దలంచి, బ్రహ్మాదులైన తామెల్లరును శ్రీవిష్ణుమూర్తివల్ల పుట్టియతని సంక ల్పానుసారముగనే వశించుచుందుమనియు, నతని మాయలోఁబడియున్నారమ నియుఁ జెప్పుచున్నాఁడు —

సీ. వినవయ్యతంత్రి యేవిశ్వేశ్వరునియందుఁ
  జతురాస్యజీవకోశములు పెక్కు
వేలసంఖ్యలుగూడి వేళతోనిబ్బంగి
  నగుచుండుఁ జనుచుండు నదియుఁగాక
యెవ్వానిచే భ్రాంతి నేమంచుచున్నార
  మేను దేవలుఁడు సురేంద్రసుతుఁడు
నారదుఁడజుఁడు సనత్కుమారుఁడుధర్ముఁ
  డాకపిలుఁడు మరీచ్యాదులఖిల
ఆ. నిర్జరులును సిద్ధ నివహామెవ్వనిమాయ
యెఱుఁగలేము మూల మిట్టి దనుచు

ఆపేట్టినిఖిలనాథు నాయుధశ్రేష్ఠంబుఁ
దొలఁగఁజేయమాకు దుర్లభంబు. 33

టీ. తండ్రి=పూజ్యుఁడైన యోదూర్వాసుఁడా! (నాపలుకులను) వినవయ్య, ఏ విశ్వేశ్వరునియందుక్ = సమస్తప్రపంచమునకును నీశ్వరుఁడైన యే విష్ణుమూర్తియందు, పెక్కువేలసంఖ్యలు=అనేకసహస్రసంఖ్యలు గలవియైన, చతురాస్య జీవకోశములు - చతురాస్య = బ్రహ్మదేవుని యధీనములై యున్న,జీవకోశములు=ప్రాణులుండుచోటగు బ్రహ్మాండములు, వేళతోఁగూడి=సృష్టికాలముతో నొకటిగాఁజేరి, ఈ భంగిక్=ఈవిధమున, అగుచునుండును=కలుగుచుండును. వేళతోఁగూడి=ప్రళయకాలమున నొకటిగాఁజేరి, చనుచుండుక్=నశించుచుండును. అదియుఁగాక=అంతేమాత్రమేగాక, ఏము=నేను బ్రహ్మమొదలగువారము, ఎవ్వానిచేక్=ఏవిష్ణుమూర్తిసంకల్పానుసారముగా (ఈబ్రహ్మాండములందు) భ్రాంతిని,అందుచున్నారము=పురుగులవలె (నిటునటు) తిరుగులాడుచున్నారము. ఏను=నేను, దేవలుఁడు=దేవలఋషి, అసురేంద్రుఁడు=ప్రహ్లాదుఁడు, నారదుఁడు, అజుఁడు=బ్రహ్మ, సనత్కుమారుఁడు, ధర్ముఁడు=యమధర్మరాజు, ఆ కపిలుఁడు=లోకప్రసిద్ధుఁడైన కపిలమహర్షి, మరీచి ఆదులు=మరీచిమహర్షి మొదలగువారు, అఖిలనిర్జరులును=సమస్తదేవతలును, సిద్ధనివహము=సిద్ధుల సమూహము, ఎవ్వనిమాయను=ఏశ్రీవిష్ణుమూర్తిమాయను, మూలము ఇట్టిది అనుచుక్=దీనికిఁ గారణ మిదియనుచు, ఎఱుఁగలేము. అట్టి...శ్రేష్ఠంబుక్=సమస్తప్రపంచములకును ప్రభువులైన యావిష్ణుమూర్తియొక్క యాయుధశ్రేష్ఠమైనచక్రమును, తొలంగఁజేయక్=తొలంగించుట, మాకు, దుర్లభంబు=అసాధ్యము.

తా. ఓదూర్వాసుఁడా! నేనొక్కమాటఁ జెప్పెదను. మిగుల జాగ్రత్తతో వినుము. నేను నావంటిజీవములను జేరినయీబ్రహ్మాండము మనబ్రహ్మదేవునివశమున నున్నదిగదా. ఇట్టిబ్రహ్మాండములు వేలకొలఁదికలవు. అవివానివానికని యేర్పడినబ్రహ్మలకుస్వాధీనములై యుండును. సృష్టికాలమురాఁగానే యవియు నావిష్ణుమూర్తియందుండి యొక్కసారి కలుగుచున్నవి. అట్లే

సంహారకాలమున నవియన్నియు నొక్కచేతూరి యతనియందు లయమగు చున్నవి. కాన,నతఁడు చిదచిచ్ఛరీరకుఁడు. అంతియకాక మేమందఱము నీతని యాజ్ఞప్రకార మీబ్రహ్మాండమునందుఁ బురుగులవలె నిటునటు దిరుగుచున్నా రము. మేమందఱ మతనిమాయలోఁబడి మునిఁగి యామాయకు మూలమేమిటో యని యాలోచించియుఁ దెలియలేకున్నారము.

వ. మునీంద్రా నీవు నమ్మహాత్ముని శరణంబు వేఁడుము. అతండు మేలుసేయం గలవాఁడని పలికిన నీశ్వరునివలన నిరాశుండై దుర్వాసుండు వైకుంఠనగరంబునకుం జని. 34

టీ మునిఇంద్రా=ఓదూర్వాసమహర్షీ ! నీవును, అమ్మహాత్మునిన్ = (పరమదయాళువు, ఆశ్రితరక్షకుఁడునిత్యాది) మహత్త్వముగల యాశ్రీవిష్ణు మూర్తినే, శరణంబు=రక్షకునిఁగా, వేఁడుము=ప్రార్థింపుము.అతండు=ఆవిష్ణు మూర్తి, (నీకు) మేలుచేయంగలవాఁడు=సుఖమునుగలిగింపఁగలఁడు, అనిపలికి నన్, దూర్వాసుండు,ఈశ్వరువలనన్=శివునియొద్ద,నిరాశుండై=రక్షించునను డియాశను వదలినవాఁడై, వైకుంఠనగరంబునకున్=బ్రహ్మాండములోని కార్య వైకుంఠమనెడిపట్టణమునకు, చని=పోయి.(పైపద్యముతోఁ జేరియన్వయము.)

తా. సమస్తకల్యాణగుణములుగల శ్రీవిష్ణుమూర్తిని శరణొందితివేని నీకీచక్రాయుధబాధతొలంగునని శివుఁడుచెప్పఁగా వినిదూర్వాసుఁడు రుద్రుఁ డీబాధను దొలఁగించుగదా యనెడి యాశనువదలుకొని యచ్చటినుండి బైలు దేఱి కార్యవైకుంఠమునకుఁ బోయెను.

శా.ఆవైకుంఠములోని భర్మమణిసౌధాగ్రంబు పై లచ్చి దాఁ గ్రేవన్ మెల్లన నర్మభాషణములం గ్రీడింపఁబుణ్యున్ హరిన్ దేవాధీశ్వరుఁ గాంచి యోవరద యోదేవేశ యోభక్తర క్షావిద్యాపరతంత్ర మానుపఁగదే చక్రానలజ్వాలలన్. 35

టీ. ఆవైకుంఠ... పైన్-ఆ వైకుంఠములోన్=ఆవైకుంఠనగరమందలి, భర్మ మణి సౌధ అగ్రంబుపైన్=బంగారుతోను రత్నములతోను గట్టఁబడిన

యింటి మేడపైన, లచ్చి=శ్రీమహాలక్ష్మీదేవి, తాను, మెల్లన=మృదువుగా, నర్మ భాషణములన్=భావగర్భితములైన మాటలతో, క్రేవన్=శ్రీవిష్ణుమూర్తిప్రక్కన, క్రీడింపన్=వేడుకగానుండఁగా, దేవాధీశ్వరున్=బ్రహ్మరుద్రాదిసమస్తదేవతలకును బ్రభువైనవానిని, పుణ్యున్=ఆశ్రితులను బవిత్రపఱుచువానిని, హరున్=ఆశ్రితుల పాపములను హరించునట్టి శ్రీవిష్ణుమూర్తిని, కాంచి=చూచి, ఓదేవేశ = బ్రహ్మరుద్రాదిసమస్తదేవతలకును బ్రభువైనవాఁడా! భక్తరక్షావిద్యాపరతంత్ర=ఆశ్రితులనురక్షించుట యనువిద్యకుఁ బరాధీనమైనవాఁడా! ఓ వరద=ఆశ్రితులకు వలసిన వరములనిచ్చునట్టి యో శ్రీమన్నారాయణా! చక్రానలజ్వాలలన్=చక్రాయుధమనెడి యగ్నియొక్క మంటలను, మానుపఁగదే=తొలఁగింపవయ్యా.

తా. వైకుంఠమునందు రత్నములతోను బంగారముతోను గట్టఁబడి వెలయుచున్న యొకగృహంబును గాంచి దూర్వాసుఁడా మేడపై కెక్కి చూచెను. అందు శ్రీమహాలక్ష్మీదేవి శ్రీవిష్ణుమూర్తిప్రక్కనుండి యాశ్రితరక్షణమును గూర్చి నర్మోక్తులు మాటలాడుచు సంతోషపఱుచుచున్నది. ఆమాటల కలరి సకలదేవోత్తముఁడైన శ్రీమన్నారాయణమూర్తియు నాశ్రితులపాపములను దీర్చి వారలను పరిశుద్ధులంజేయు దీక్షతో వెలయుచున్నారు. అట్టి సమయంబునుగాంచి వారియెదుట నిలిచి దూర్వాసుఁ డిట్లు మొఱపెట్టుకొనెను. ఓస్వామీ! నీవు బ్రహ్మాదిసకలదేవతలకును నీశ్వరుఁడవు. తమవల్లఁగాదనివారు విడచినవానినెల్ల నెఱవేర్చి కాపాడువాఁడవు నీవే. ఆశ్రితులకష్టములను దొలఁగించి వారికోరికల నీడేర్చుటయే నీకు సదాకార్యము. అదితప్ప నీకు వేఱుకార్యము లేదు. నేను నీ పాదముల నాశ్రయించితిని. నీ చక్రాయుధమువలని బాధను దొలఁగించి నన్ను రక్షింపవయ్యా.

అవ. తనకుఁ జక్రాయుధమువలని బాధ కలిగినందులకుఁ గారణము మనవిచేసికొనుచు నిట్టి నాకష్టమును దీర్చి నన్నుఁ గాపాడ వలంతివి నీవే

యని సూచింప నెంచి శ్రీవిష్ణుమూర్తి నామధేయమునకుం గల మహిమను బొగడుచున్నాఁడు.——

ఉ. నీమహిమార్ణవంబు మది నిక్కముగా నెఱుఁగంగలేక నీ
ప్రేమకువచ్చుదాసులకుఁ గ్రించుఁదనంబున నెగ్గుసేసితిన్
నామఱపున్ సహింపు మట నారకుఁడైన మనంబులో భవ
న్నామముచింతసేసిన ననంతసుఖస్థితి నొందకుండునే. 36

టీ. నీమహిమ అర్ణవంబును = సముద్రమువలె నపారమైన నీప్రభావమును, మదిన్=మనస్సునందు, నిక్కముగాన్ = వాస్తవముగా, ఎఱుఁగలేక = తెలిసికొనలేక = మఱచి, నీప్రేమకువచ్చుదాసులకున్=నీప్రీతిపాత్రులైన నీభక్తులకు, అంబరీషునికి (గౌరవార్థమై బహువచనము) క్రించుఁదనంబునన్=నీచస్వభావము చేత, ఎగ్గు = కీడు, చేసితిని, నామఱపున్ = నాయజ్ఞానమువలని నేరమును, సహింపుము=క్షమింపుము (నాయపరాధమును క్షమించుట నీకుయుక్తమే. ఏలయన,) అటన్=ప్రసిద్ధమైన నరకమునందు, నారకుఁడైనను = నరకబాధ ననుభవించువాఁడైనను, మనంబులోన్ = తన మనస్సులో, భవన్నామమున్ = నీనామధేయమును, చింతచేసినన్ = (తన కష్టములను దొలఁగించునట్టిదని) ధ్యానించినయెడల, అనంతసుఖస్థితిన్=స్థిరమైనసుఖదశను, ఒందకుండునే=పొందకుండునా, (తప్పక పొందును.)

తా. ఓస్వామి! నీమహత్త్వము పెద్దసముద్రమువలె నపారమైనది. నేను మిక్కిలి హీనుఁడనుగాన దాని వాస్తవమును దెలిసికొనలేక నీకత్యంతప్రియ భక్తుఁడైన యంబరీషమహారాజును నానీచబుద్ధికిఁ దగినట్లవమానపఱిచి యతనికిఁ గీడుచేసితిని. అట్లుచేయుటవలనఁ దప్పునాదే? నేను దెలియకచేసినతప్పు మన్నింపవయ్యా! సాధ్యపడదని నన్నుఁ ద్రోసిపుచ్చకుమయ్యా! ఒకఁడు నరకములోఁబడి యల్లాడుచున్నను దనకష్టములు తొలఁగుటకై నీనామధేయమును స్మరించెనేని వాని కాకష్టము తొలఁగుటయేకాక స్థిరమైన

సౌఖ్యముకూడ లభించునుగదయ్యా! నీనామధేయమునకే యింతమహాత్త్వ మున్నప్పుడు నీమహత్త్వమును గూర్చి చెప్పవలెనా?. కాన నన్నుఁ దప్పక కాపాడవలెను.

వ. అనిపలికి పాదకమలములకు మ్రొక్కి లేవకయున్న దూర్వా
సునిం గని హరి యిట్లనియె. 37

టీ. అని పలికి=ఇట్లుప్రార్థించి, పాదకమలంబులకున్=తామరపూవుల వలె నందములైయున్న శ్రీవిష్ణుమూర్తి పాదములకు, మ్రొక్కి=నమస్క-రించి, లేవకయున్నదూర్వాసున్ = లేవకయట్లేపడియున్న దూర్వాసుని, హరి=శ్రీవిష్ణుమూర్తి, కని = చూచి, ఇట్లనియెను.

తా. దూర్వాసుఁ డిట్లు తనప్రార్థనను విన్నవించుకొనుచు శ్రీవిష్ణుమూర్తిపాదపద్మములకుసాష్టాంగముగా మ్రొక్కి తన్నుఁగాపాడునంతవఱకు లేచుటలేదని యట్లే పడి యుండెను. అంతవానింగని శ్రీవిష్ణుమూర్తి యిట్లనియె.

అవ. ఓదూర్వాసా! నారదుఁడు నానామస్మరణచేసి తనకష్టములనుండి తొలఁగి స్థిరమైన సుఖమునొందునని నీవుచెప్పునది సరియే. అతని యపరాధము నన్నుగురించినదే యయియుండును గాని నాభక్తుని గురించినది కాదు. కాన నతనికష్టములు తొలఁగెను. నాభక్తునిగురించిన యపరాధమును మన్నించుట నాకు వీలుపడదు. నేనుభక్తులకుఁ బరతంత్రుఁడనేకాని వారిని మీఱిపోవువాఁడనుగాను. ఇదివేదాంతములందుఁ బ్రసిద్ధమైయుండఁగా నన్నడిగెదవేల?. నీవు నాభక్తుని కపరాధముచేసితివి. అది నే నెట్లు మన్నింపనగును?. అని సూచనయగున ట్లుత్తరమిచ్చుచున్నాఁడు:—

చ. చలమునబుద్ధిమంతులగుసాధులు నాహృదయంబులీలదొం
గిలికొనిపోవుచుండుదు రకిల్బిషభక్తిలతాచయంబులన్
నిలువఁగఁ బట్టి కట్టుదురు నేరుపుతో మదకుంభికైవడిన్
వలలకుఁ జిక్కి భక్తజనవత్సలతంజనుచుందుఁదాపసా. 38

టీ. తాపసా=ఓదూర్వాసా బుద్ధిమంతులు = గొప్పజ్ఞానముకలవారు, అగుసాధులు = అగునట్టిసత్పురుషులు, చలమునన్ = పట్టుదలతో, లీలన్=

అనాయాసముగా, నాహృదయంబును = నామనస్సును, దొంగిలికొనిపోవుచుందురు=అపహరించుకొని పోవుచుందురు. (మఱియు) అకల్మష భక్తిలతాచయంబులన్ - అకల్మష=నిష్కల్మషమైన, భక్తిలతా = భక్తియనెడితీఁగలయొక్క, చయంబులన్ = సమూహములచేత, నేరుపుతోన్ = సామర్థ్యముతో, మదకుంభికైవడిన్ = మదపుటేనుఁగునువలె, నిలువఁగఁబట్టి=నిట్టనిలువుననే కట్టుదురు. (కాఁబట్టి), భక్తజనవత్సలతన్ = భక్తులపైనున్న వాత్సల్యముతో, వలలకున్=(భక్తులయొక్క భక్తియనెడి) వలలకు, చిక్కి= తగులుకొని, చనుచుందును=ఉందును.

తా. బ్రహ్మవేత్తలు తమసర్వేంద్రియములచేతను నాకే సమస్తోపచారములను జేయవలెనని మిక్కిలి పట్టుదలతోనుందురు. వారిపట్టుదలకు మెచ్చి నామనస్సు వారికిలోబడును. అంతియకాక తీఁగలచేత నేనుఁగుగట్టినట్లు వారు తమభక్తిచేత నామనస్సును నిట్టనిలువునఁ బట్టి కట్టివేయుదురు. వారి భక్తియనెడి వలలోఁ జిక్కి నామనస్సువారికి లోబడియుండును. దానంజేసి నామనస్సు వారియిష్టానుసారము నడుచుచుండును. నేనిట్లు భక్తికిమెచ్చి వారిపై వాత్సల్యముంచి వారికిఁ బరతంత్రుఁడనై యుండుట నాకన్నివిధముల గొప్పయేకాని హేయముకాదు.

ఆ. నాకు మేలు గోరు నాభక్తుఁ డగువాఁడు
భక్తజనుల కేన పరమగతియు
భక్తుఁ డెందు జనినఁ బఱతెంతు వెనువెంట
గోవు వెంటఁ దగులు కోడెభంగి. 59

టీ. నాభక్తుఁడగువాఁడు=నాయందుభక్తియుంచువాఁడు, నాకుమేలు కోరును=నాకేమేలుకోరుచుండును. భక్తజనులకున్=నాయందు భక్తియుంచినవారికి, ఏనున=నేనే, పరమగతియున్=గొప్పజీవనోపాయము, భక్తుఁడెందుఁ జనినన్=నాభక్తుఁడెచ్చటఁబోయినను, వెనువెంటన్=ఆభక్తునివెంబడియే, గోవువెంటన్=ఆవువెంబడి, తగులుకోడెభంగిన్=పోవునట్టి వృషభమువలె, పఱతెంతును=పోవుదును.

తా. ఓదూర్వాసుఁడా! నామనస్సు నాభక్తుల యధీనముకాన వారి కేదిహితమో యదియే నాకును హితముగాని వారినివిడిచి నాకనియొకహితము లేదు. కాఁబట్టి నామేళ్లన్నియువారేయరయుచుందురు. ఇంతియకాక వారు తమజీవనార్థము నన్నుఁదప్ప నింకొక్కని నాశ్రయింపరు. కాన నేనే వారి జీవనము నెఱవేర్చి వారిప్రీతికిఁ బాత్రుఁడనగుదును. ఇట్లు వారు నాకేమేలు కోరుచుండుటచేతను నన్నే యాశ్రయించుటంబట్టియు నీరెండుకారణముల చేతనాకు వారు పరమప్రియులు. దానంజేసి వారెచ్చటఁ బోయినను నావు వెంబడిపోవు నాఁబోతువలె వారివెంబడియే నేనును బోవుచుందును.

వ. అదియునుంగాక. 40

టీ. అదియునుంగాక = అంతమాత్రమేకాక.

అవ. "భక్తజనులకేనపరమగతి" యనుదానిని వివరించుచు, నా హేతువుచేతనే యట్టివారల నేను విడువఁజాల ననుచున్నాఁడు.—

ఆ॥ తనువు మనువు విడిచి తనయులఁ జుట్టాల
నాలివిడిచి సంపదాలి విడిచి
నన్నకాని యన్య మెన్నఁడు నెఱుఁగని
వారి విడువ నెట్టివారి నైన. 41

టీ. తనువు=శరీరమును, మనువు=ప్రాణమును, విడిచి(ఇవి సంసారమునకు హేతువులేకాని వేఱుకావని విమర్శించి). యివి రక్షణోపాయములని యెడి బుద్ధినివదలి; తనయులను=కుమారులను, ఆలిని=భార్యను, చుట్టాలను విడిచి, నన్నకాని=నేనేతప్ప, అన్యము=మఱొకవస్తువును, ఎన్నఁడును ఏకాలమునందైనను, ఎఱుఁగనివారిని= (తమజీవనోపాయములని) తెలిసికొనక యేయున్న నాభక్తులను, ఎట్టివారినైనను = ఎంతతక్కువదశలోనున్నవారినైనను విడువను.

తా. మఱియు నాభక్తులు తమజీవనోపాయ మేదని పర్యాలోచించి తమదారపుత్రాదులందఱుఁ దమకు సంసారహేతువులేకాని తారణకారణములుకారని విమర్శపూర్వకముగా నిశ్చయించి వారినందఱును వదలి నన్నే

క్కానిదే జీవనోపాయముగా భజించియున్నారు. కాన నిట్టివాస్తవాంశ మెఱింగి నన్నే నమ్మియున్న నాభక్తు లెంతతక్కువవారుగానున్నను నేనువదలను. అట్టివారిని ద్రోసిపుచ్చుట నాకు నమ్మకప్రద్రోహము కాదా?. కాన నాభక్తుని నవమానపఱచిన నిన్ను వాని యనుమతిలేక రక్షించితినేని నాభక్తుని నేను వదలినట్లగును. అట్టికార్యము నాకు వీలుపడదు.

క. పంచేంద్రియముల తెరువుల
వంచించి సుఖంబులందు వరమతులు ప్రతి
ష్ఠించి వహింతురు నన్నును
మంచిపతిం బుణ్యసతులు మరగించు క్రియన్. 42

టీ. వరమతులు=గొప్పజ్ఞానముగల భక్తులు, పంచేంద్రియముల తెరువులన్=పంచేంద్రియములమార్గములను, వంచించి=మోసపుచ్చి (పంచేంద్రియములమార్గముగాఁబోయి యనుభవింపవలసిన శబ్దాదులననుభవింపక), పుణ్యసతులు=పతివ్రతలు, మంచిపతిన్=సద్గుణవంతుఁడైన తమభర్తను, మరగించు క్రియన్=తమపైననే యాశయుంచునట్లుచేయువిధమున, నన్నును, సుఖంబులందు, ప్రతిష్ఠించి వహింతురు=దృఢముగా నిల్పుకొనియుందురు. (నన్నుదమ కధీనపఱచుకొందురని భావము.

తా. పతివ్రతలు తమసౌఖ్యమును పాటింపక తమభర్తయందు నిరవధికమైన ప్రేమయుంచి యతని శుశ్రూషచేయుచు నతనిని దమయధీనపఱచుకొనునట్లు, యుక్తాయుక్తవివేకముగలనాభక్తులు శబ్దస్పర్శరూపరసగంధములనెడి విషయాంతరములజోలికిఁ బోక నన్నే ప్రేమతోఁడ స్వమనస్సున దృఢముగా ధ్యానించుచుఁ దమవశపఱచుకొందురు.

క. సాధులహృదయము నాయది
సాధులహృదయంబు నేను జగములనెల్లన్
సాధుల నేన యెఱుంగుదు
సాధు లెఱుంగుదురు నాదుచరితము విప్రా. 43

టీ. విప్రా=ఓదూర్వాసుఁడా! నాయది=నాదైన, హృదయంబు=మనస్సు, సాధులు=సత్పురుషులు (అగుదురు) నేను. సాధులహృదయంబు=సత్పురుషులమనస్సు (అగుదును). జగములనెల్లన్=సమస్తలోకములందును, నేను, సాధులనే యెఱుంగుదును=సాధులను దప్ప వేఱొకరిని బ్రియముగా నెఱుఁగను. సాధులు, నాచరితము = నాకథను, ఎఱుఁగుదురు=ప్రియముగా నెంతురు.

తా. నాభక్తులగు సత్పురుషులు నాహృదయముప్రకారము నడుచుకొందురు. నేనును వారియిష్టప్రకారము నడుచుకొందును. సత్పురుషులకు నాచరితముతప్ప నింకొకటి ప్రియముగాదు. నాకు వారుదప్ప నితరులు ప్రియులుగారు. ఇట్లు మేమొకొక్కరిమనసుప్రకారము నడచుకొనుటచేతను, బరస్పరము ప్రియులై యుండుటచేతను నాభక్తులను గాదని వేఱొక్కరికి నేను సహాయపడను. కాన నంబరీషునిసమ్మతిలేక నేను నిన్ను రక్షింపను.

తే. ధారుణీసురులకుఁ దపము విద్యయు రెండు
ముక్తిచేయుచుండు ముదముతోడ
దుర్వినీతులైనదుర్జనులకు మీకు
నివియుఁ గీడు గాక యేలయుండు. 44

టీ. ధారుణీసురులకున్=మంచిబ్రాహ్మణులకు, తపము=తపస్సు, విద్యయును=చదువును (ఈ) రెండును, ముదముతోడన్=సంతోషముతో, ముక్తిచేయుచుండును=మోక్షమును గలిగించుచుండును. దుర్వినీతులైన=తలబిరుసుఁదనము కలవారైన, దుర్జనులకున్=దుర్మార్గులగు, మీకున్ = మీవంటివారికి, ఇవియున్=తపస్సు విద్యయను రెండును, కీడుకాక = దుఃఖకరములుగాక, ఏలయుండును. (తప్పక దుఃఖకరములే యగును).

తా. ఓదూర్వాసుఁడా! సన్మార్గులైన బ్రాహ్మణులు చదువుకొని తపస్సుచేసి మోక్షముపొందవచ్చునుగాని మీవంటి తలబిరుసులైనవా రెంత చదువుకొన్నను దపస్సుచేసినను మఱింతయహంకారముగలిగి చేయరాని

కార్యములుచేసి కీడేపొందుచుందురుగాని మేలుపొందనేలేరు. కాన నీయందున్న తపోవిద్యలకై యహంకారపడకుము.

క. నా తేజము సాధులలో
నాతత మైయుండు వారి నలఁచుజనులకున్
హేతి క్రియ భీతినిచ్చును
జేతోమోదంబు చెఱచు సిద్ధము సుమ్మీ. 45

టీ. నా తేజము=నాశక్తి, సాధులలోన్=సత్పురుషులయందు, ఆతతమై=విస్తారమై, ఉండును. (అది) వారిని=సాధులను, అలఁచుజనులకున్=పీడించుజనులకు, హేతి క్రియన్=చక్రాయుధమువలె, భీతినిచ్చుచు = భయమును గలిగించును. చేతః మోదంబు = మనస్సంతోషమును, చెఱచును. (ఈకార్యము), సిద్ధము సుమ్మీ=తప్పక కలుగును.

తా. నాభక్తులయందు నాశక్తి వెలయుచుండును. వారి కెవరైనను గీడుచేసిరేని యాశక్తి చక్రాయుధమువలె నుండుచు నాసాధు విరోధులను వెంబడించి బాధించును. దానంజేసి యావిరోధులు సంతోష ముడిగి భయపడుచుందురు. ఇది తప్పదు.

క. అదె పో బ్రాహ్మణ నీకును
సదయుఁడు నాభాగసుతుఁడు జనవినుతగుణా
స్పదుఁ డిచ్చు నభయమాతని
మది సంతసపఱిచి వేఁడుమా శరణంబున్. 46

టీ. బ్రాహ్మణ=నేనే గొప్పబ్రాహ్మణుఁడన్న గర్వముగల ఓ దూర్వాసుఁడా! సదయుఁడు=దయగలవాఁడు, జన...ఆస్పదుఁడు-జనవినుత=జనులచేఁ గొనియాడఁబడిన, గుణ ఆస్పదుఁడు=గుణములు గలవాఁడు (అగు), నాభాగసుతుఁడు = నాభాగునికుమారుఁడు (అంబరీషుఁడు), నీకును = నీయంతటిసాక్షాద్విరోధికిని, అభయ మిచ్చును=భయము లేకుండఁ జేయును. అదె=అదిగో, నున్నాఁడు, పో = పొమ్ము. మదిన్ = (అతని) మనస్సును,

సంతసపటిచి=సంతోషపడునట్లుచేసి, అతనిని=ఆయంబరీషుని, శరణంబుగ=రక్షకునిఁగా, వేఁడుమా=ప్రార్థింపుమా.

తా. ఓదూర్వాసుఁడా! యీ యాభిజాత్యాహంకారము విడలుము. అదిగో నంబరీషుఁ డున్నాఁడు. అతఁడు నీవలె నహంకారికాఁడు సద్గుణవంతుఁడు మిక్కిలి దయాళువు. అతఁడే నిన్నుఁ గాపాడవలెను. కాన నతని పాదములపైఁ బడుము. అతని కపకారముచేసి మరల నతని నేనెట్లువేఁడుదు నని యెంచకుము. నీవు శరణుఁ జొచ్చితివేని యతఁ డాయపకారమును బాటింపక నీ భయముఁ దీర్చి రక్షించును. కాన నతనిపాదములపైఁబడి యతనిని సంతోషపటిచి వేఁడుకొనుము.

మ. అని శ్రీవల్లభుఁ డానతిచ్చినమహోద్యచ్చక్రకీలావళీ
జనితాయాసుఁడు నిర్వికాసుఁడుదితశ్వాసుండుదుర్వాసుఁడ
ల్లన నేతెంచి సుభక్తిఁ గాంచెఁ గరుణాలావణ్య వేషు న్విదో
షు నయోదారమనీషు మంజుమితభాషు న్నంబరీషు న్వెసన్.

టీ. అని=ఇట్లు, శ్రీవల్లభుఁడు=లక్ష్మీదేవికి భర్తయైన శ్రీవిష్ణుమూర్తి, ఆనతిచ్చినన్=ఆజ్ఞాపింపఁగా, మహత్...ఆయాసుఁడు-మహత్ ఉద్యత్=మిక్కిలివిజృంభించుచున్న, చక్ర=చక్రాయుధముయొక్క, కీలా=మంటలయొక్క, ఆవళీ=సమూహముచేత, జనిత=కలిగింపఁబడిన, ఆయాసుఁడు=శ్రమముకలవాఁడు (కనుకనే) నిర్వికాసుఁడు=కళతగ్గినవాఁడు, ఉదితశ్వాసుండు=నిట్టూర్పువిడుచుచున్నవాఁడును, (అగు) దూర్వాసుఁడు అల్లనన్=తిన్నఁగా, ఏతెంచి=విష్ణుమూర్తి సన్నిధానమునుండివచ్చి, విదోషున్=అహంకారాదిదోషములు లేనివానిని, కరుణా లావణ్య వేషున్=దయచేతరమణీయమైనయాకారముకలవానిని, నయ ఉదార మనీషున్=న్యాయముచేతగంభీరమైన బుద్ధికలవానిని, మంజు మిత భాషున్=ఇంపుగాను మితముగాను మాటలాడువానిని, అంబరీషున్, వెసన్ శీఘ్రముగా, సుభక్తిన్ = చక్కని భక్తితో, కాంచెన్.

తా. ఇట్లు లక్ష్మీదేవి పురుషాకారముచేత శ్రీవిష్ణుమూర్తి చక్రాని యుపాయమును దెల్పెను అదివిని దూర్వాసుఁడు, చక్రాయుధము వెంటనంటుచుఁ బైపడి తన్నుఁ బఱచుచుబాధలను తాళలేక ముఖముకళతగ్గి పెద్దనిట్టూర్పు పుచ్చుచువిరోధిని శరణొందవలసి వచ్చెఁగదాయని సిగ్గుచేఁ దిన్నగాఁబోయి మిగులభక్తితో నంబరీషుని దర్శనముచేసికొనెను. అంబరీషుఁడు మిక్కిలి దయాళువు. అతని యాకారముననే యాదయ స్పష్టపడుచుండును. అతని బుద్ధి మిగులగంభీరమైనది. న్యాయమార్గముదప్పదు. అతనివాక్కు మృదువైనది. మితమైనది. ఇన్నిగుణములున్నను రవంతేనియు నహంకారపడఁడు.

వ్యాకరణాంశము.—"పుంజుమితభాషు న్నంబరీషున్" అనెడిచోట ద్రుతమునకచ్చు పరమగునపుడు ద్విత్వమువచ్చియున్నది. ఇట్లే "అన్నిష్టసఖిఁ జూచియున్నదాని" యని భారతమున నన్నయభట్టారకుని ప్రయోగముకలదు. "సర్వాంగుని న్ననుభూతాప్రతిమ..." అని యుత్తరహరివంశము (౬-వ ఆ.) ఇట్టిప్రయోగములు పెక్కులుగలవు. ఇట్లున్నను నన్నయభట్టారకుఁడాంధ్రశబ్దచింతామణియందు "లుక్సంశ్లేషౌ నాచి ద్రుతస్య" ద్రుతమున కచ్చు పరమగునపుడు లోపసంశ్లేషములు రావని నిషేధించుట ప్రయోగవైరళ్య సూచనార్థమని యెఱుఁగునది. ఈయంశము ప్రౌఢవ్యాకరణము సంధి పరిచ్ఛేదము మూఁడవ సూత్రమునఁ జూడుఁడు.

వ. కని దుఃఖితుండై మహీవల్లభుపాదంబులు వట్టి విడువకున్న నానరేంద్రచంద్రుండు చరణస్పర్శనంబునకు నోడుచుఁ గరుణారసభరితహృదయుండై హరిచక్రంబు హృదయంబున నిట్లని స్తుతియించె. 48

టీ. కని=చూచి, దుఃఖితుండై = దుఃఖపడినవాఁడై, మహీవల్లభు పాదంబులు పట్టి=అంబరీషమహారాజుపాదంబులుపట్టుకొని, విడువకున్నన్= విడిచిలేవకుండఁగా, ఆరాజచంద్రుఁడు = రాజోత్తముఁడైనయా యంబరీషుఁడు, చరణస్పర్శనంబునకున్=(బ్రాహ్మణుఁడు) తనపాదములుతాఁకుటకు, ఓడుచున్=భయపడుచు, కరుణారస భరితహృదయుండై =దయారసముచే

నిండినమనస్సు కలవాఁడై, హరిచక్రంబును=విష్ణుమూర్తిచక్రాయుధమును, హృదయంబునన్ = తనమనస్సుననే, ఇట్లని = పైఁజెప్పఁబోవురీతిగా, స్తుతియించెన్=పొగడెను.

తా. ఇట్టిసద్గుణశాలియగు నంబరీషునిఁగాంచి దూర్వాసుఁడు దుఃఖముతాళలేక యతనిపాదములపైఁబడి లేవకుండెను. అంత నంబరీషమహారాజు, బ్రాహ్మణుఁ డిట్లు తనపాదములపైఁబడుట తనకు మిక్కిలి యపచారమని యెంచి భయపడి తోడనే యాతనిపై మిక్కిలి దయాళుఁడై యతని బాధ తొలఁగుటకై శ్రీచక్రాయుధము నిట్లు పొగడఁదొడఁగెను.

సీ. నీవపావకుఁడవు నీవసూర్యుండవు
 నీవ చంద్రుండవు నీవజలము
 నీవనేలయు నింగి నీవసమీరంబు
 నీవ మాత్రేంద్రియనికరములును
 నీవ ధర్మంబును నీవ సత్యంబును
 నీవ యజ్ఞంబును నీవ ఫలము
 నీవ లోకేశులు నీవ సర్వాత్మవు
 నీవకాలంబును నీవజగము
తే. నీవ బహుయజ్ఞభోజివి నీవనిత్య
 మూలతేజంబు నీకు నే మ్రొక్కువాఁడ
 నీరజాక్షుండు చాలమన్నించునట్టి
 శస్త్రముఖ్యుఁడ వీవ కావవే చాలు మునిని. 49

టీ. నీరజాక్షుండు=తామరపూవులవంటి కన్నులుగల శ్రీవిష్ణుమూర్తి, చాలన్=మిక్కిలి, మన్నించునట్టి=ప్రేమించునట్టి, శస్త్రముఖ్యమ=ఆయుధములలో శ్రేష్ఠమైన యోచక్రమా! నీవు అ=నీవే, పావకుఁడవు=అగ్నివి. (నీయంతర్యామియు నగ్న్యంతర్యామియు శ్రీవిష్ణుమూర్తియొక్కఁడే కాన నిన్నుఁ బావకుండనుట.) ఇట్లే పైవి యభేదములన్నియుఁ దెలియునది. నీవ, సూర్యుండవు, నీవ, చంద్రుఁడవు, నీవ, జలము, నీవ, నేలయు=భూమియు,

నీవ, నింగి=ఆకాశము, నీవ, సమీరము=వాయువు, నీవ, మాత్రేంద్రియని కరములును-మాత్రా=(ప్రపంచభూతములకును గారణములైన) పంచతన్మాత్రలును, ఇంద్రియనికరములును=పదునొకం డింద్రియములును, నీవ, ధర్మంబును = ధర్మమును నిర్వహించువాఁడవును, నీవ, సత్యంబును = సత్యమును రక్షించువాఁడవు, నీవ, యజ్ఞంబును = యాగములను నెఱవేర్చువాఁడవు, నీవ, ఫలము=(ఆయజ్ఞములకు) ఫలముల నిచ్చువాఁడవు, నీవ, లోకఈశులు =లోకపాలకస్వరూపుఁడవు, నీవ, సర్వాత్మవు=అందఱకును నంతరాత్మవు, నీవ, కాలంబు = కాలస్వరూపుఁడవు, నీవ, జగము=సమస్తలోక స్వరూపుఁడవు, నీవ, బహుయజ్ఞభోజివి= అన్ని యజ్ఞముల ఫలములను ననుభవించువాఁడవు, నీవ, నిత్యమూలతేజంబు=సదాకారణమైయున్న పరమాత్మపౌరుషము (జగత్సంహారసంకల్పము), నీకు, నేను, మ్రొక్కువాఁడను = నమస్కరించెదను. మునిని=దూర్వాస మహర్షిని కావవే=రక్షింపవయ్యా? చాలును= ఇంతవఱకు బాధించినది చాలును.

తా. ఓ చక్రరాజా! నీవు సూర్యాది సకలతేజోరూపుఁడవు. పృథివీ జలవాయ్వాకాశరూపుఁడవు. కాన పంచభూతస్వరూపుఁడవు. అంతియ కాక వానికిఁ గారణమైనతన్మాత్రలును నీవే. సప్తేంద్రియములును నీవే. యజ్ఞములను నిర్వహించువాఁడవు నీవే. యజ్ఞారాధ్యుండవును నీవే యజ్ఞములు చేసి యనుభవింపవలసిన ఫలములును నీవే. లోకములును గాలములును లోకేశులును నీవే. పరమాత్మవు నీవే. పరపురుషుని జగత్సంహారశక్తియు నీవే. ఇంతటివాఁడవై యుండి యీశరణాగతుఁడైన దూర్వాసుని రక్షించి యీధర్మము కట్టుకొనవయ్యా ఇంతియ కాక, నీవు శ్రీవిష్ణుమూర్తికిఁ బ్రియుఁడవు. ఆయనయిష్టము నెఱవేర్చువాఁడవు. మావంటిభక్తుల కేది ప్రియమో యదియే యాయనకు బ్రియము. నీకును నదేగదా ప్రియము! కాన నాకుఁ బ్రియమై తన్మూలమున శ్రీవిష్ణుమూర్తికిని బ్రియమైన యీ బ్రాహ్మణరక్షణము ను జేయవయ్యా! ఇంక నీతని బాధింపకుమయ్యా! స్థూలపృథివియొక్క సూక్ష్మావస్థ పృథివీతన్మాత్ర యనఁబడును. ఇట్లే జలతన్మాత్ర తేజస్తన్మాత్ర వాయుతన్మాత్ర ఆకాశతన్మాత్ర యని యైదుతన్మాత్రలుకలవని వేదాంతము

లందుఁ బ్రసిద్ధము. త్వక్కు, చక్షుస్సు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము అని యైదు జ్ఞానేంద్రియములు. వాక్కు, పాణి, పాదము, పాయువు, మూత్రద్వారమని యైదు కర్మేంద్రియములు. మన స్సన్నియింద్రియములకును బ్రధానము కాఁగాఁ బదునొకం డింద్రియములు.

మ. హరిచే నీవు విసృష్టమై చనఁగ మున్నాలించి నీధారలన్
ధరణిన్ వ్రాలుట నిక్కమంచు మునుపే దైత్యేంద్రమధ్యంబు
లో, శిరము ల్పాదములున్ భుజాయుగళముల్ ఛేదిల్ల నం
గంబులు, న్నొరలుం బ్రాణసమీరముల్ గదలు నీయుద్ధంబు
లం జక్రమా. 50

టీ. చక్రమా! నీయుద్ధంబులన్ = నిన్నాయుధముగాఁ జేసికొని విష్ణుమూర్తి రాక్షసులతోఁ జేయు యుద్ధములందు, హరిచేన్ = శ్రీవిష్ణుమూర్తిచేత, నీవు విసృష్టమై = ప్రయోగింపఁబడి, చనఁగన్ = (శత్రువులపై) పోవునపుడు, మున్నె = పూర్వమే, ఆలించి = (రాక్షసులు నీరాకను) విని, (తాము) ధరణిన్ = భూమిపై, వ్రాలుట = పడుట, నిక్కము = నిజము, అంచున్ = అని తలఁచుచు, మునుపే = నీవు వారిపైఁ బడక పూర్వమే, దైత్యేంద్ర మధ్యంబులోన్ = రాక్షససేనలో, శిరముల్ = తలలు, పాదములు = కాళ్లు, భుజాయుగళముల్ = రెండుభుజములు, ఛేదిల్లన్ = తునిఁగిపడఁగా, అంగంబుల్ = శరీరములు, ఒరలున్ = దిగుపఁబడును. ప్రాణసమీరముల్ = ప్రాణవాయువులు, కదలును = వెడలిపోవును.

తా. ఓ చక్రరాజా! విష్ణుమూర్తి రాక్షసులతో యుద్ధము చేయునపుడు నిన్ను వారిపైఁ బ్రయోగించును రాక్షసులును. నీశక్తిని బూర్వము నుండియే బాగుగాఁ దెలిసినవారు. కాన నీవు వచ్చుచున్నాఁడవని విన్నతోడనే నీచేఁ దాము చచ్చుట నిశ్చయమని యెంచి భయాతిశయముచేఁ దమసర్వావయవములును విఱిగి దేహము క్రిందఁబడిపోఁగాఁ దమకుఁ దామే ప్రాణములు వదలిపోవునట్లుందురు.

ఆ. కలఁగి నిద్రపోవఁ గలలోనవచ్చిన
నిన్నుఁజూచి దీర్ఘనిద్రవోదు
రసురవరులు శయ్యలందున్నసతులు ప్ర
భాతమందు లేచి పలవరింప. 51

టీ. అసురవరులు=గొప్పరాక్షసులు, నిద్రవోవన్=నిద్రించునపుడు, కలలోనన్=స్వప్నమునందు, నిన్నుఁజూచి = నిన్నుఁజూచినట్లు కలఁగని, కలఁగి=భయపడి, శయ్యలందున్=(తమ) పడుకలలోనే, ఉన్నసతులు = పరుండియున్న తమభార్యలు, ప్రభాతమందున్=వేకువ, లేచి=మేల్కొని, పలవరింపన్=ఏడ్చునట్లు, దీర్ఘనిద్రవోదురు=చత్తురు.

తా. ఓ చక్రరాజా! నీశత్రులైన రాక్షసులు రాత్రి నిద్రపోవునపుడు నిన్నుఁ గలలోఁ గాంచిరేని తోడనే యడలిచత్తురు. వారిభార్యలు వారితోడనే పరుండియున్నను నాసంగతితెలియక యుదయముదాఁక నిద్రపోయి వేకువలేచి తమభర్తలపాటునుజూచి మిక్కిలి దుఃఖముతో నేడ్వనారంభింతురు.

ఉ. చీఁకటి వాపుచున్ వెలుఁగు సేయుచు సజ్జనకోటినెల్లన
శ్రీకులఁజేయునీరుచులు చెల్వుగ ధర్మసమేతలై నినున్
వాకుననిట్టిఁడట్టిఁడని వర్ణన సేయ విధాతనేరఁడ
స్తోకము నీమహామహిమదోష నివారి పరాపరాద్యమే.

టీ నీరుచులు=నీకాంతులు, ధర్మసమేతలై=ధర్మములతోఁగూడినవై (సకలధర్మములను నిర్వహించునవి కాన ధర్మముతోఁ గూడినవనుట) చీఁకటి =అజ్ఞానాంధకారమును, వాపుచున్=పోఁగొట్టుచు, వెలుఁగు = చక్కని జ్ఞానమును, చేయుచున్=కలిగించుచు (సూర్యకాంతి మొదలగునవి చీఁకటిని బోఁగొట్టి వెలుతురు నిచ్చునట్లు నీకాంతులు భక్తుల యజ్ఞానమనెడి చీకటినిబోఁగొట్టి జ్ఞానమనెడువెలుతురును గలుగఁ జేయుచున్నదనిభావము.) సజ్జనకోటినెల్లన్=సత్పురుషసమూహమునంతను, చెల్వుగన్ = బాగుగా, సశ్రీకులన్ = సత్కీర్తి కలవారిని (గా), సంపదకలవారినిఁగా చేయును.

విధాత=బ్రహ్మదేవుఁడుకూడ, నిన్నున్, ఇట్టిఁడు=ఇట్టిగుణాదులుకలవాఁడు, అట్టిఁడు=అంతటిగుణాదులు కలవాఁడు, అని, వాకున్=మాటలచే, వర్ణన సేయనేరఁడు=చెప్పలేఁడు. (కాఁబట్టి) నీమహామహిమ=నీగొప్పప్రభావము అస్తోకము=అపరిమితమైనది. దోషనివారి = ఆశ్రితుల తప్పులను బోఁగొట్టు నది. పరాపరాద్యమే=లోకములోని యుత్కృష్టవస్తువులకును నపకృష్టవస్తువులకును మూలకారణమైనది.

తా. ఓచక్రరాజా! నీజ్వాలలు సకలధర్మములను బాలించునవిగానఁ దమ్ముధ్యానించెడిసత్పురుషుల యజ్ఞానమును బోఁగొట్టి సుజ్ఞానము నిచ్చి సత్కీర్తిని గలిగించును. మఱియు వారికి విశేషముగా నిహపరసంపదలఁ గలిగించును. నీప్రభావము ప్రపంచములోనిసర్వవిధ పదార్థములకును గారణమైనది. మఱియు నది నీయాశ్రితులపాపములను హరించి సర్వోత్కృష్టమైనది. కాన బ్రహ్మదేవుఁడుగూడ నిన్ను నింతవాఁడంతవాఁడని కొలఁదిగాఁ జెప్పలేఁడు.

ఆ. కమలలోచనుండు ఖలులశిక్షింపఁగఁ
బాలుసేయ నీవు పాలుపడితి
వైననింకఁజాలు నాపన్నుఁడై యున్న
తపసిఁగావు యీవు ధర్మవృత్తి. 53

టీ. కమలలోచనుండు = తామరపూవులవంటి కన్నులుగల శ్రీవిష్ణుమూర్తి, ఖలులన్=దుర్మార్గులను, శిక్షింపఁగన్ = దండించుటకు, పాలుచేయన్=ఆజ్ఞాపింపఁగా, నీవు, పాలుపడితివి=పూనుకొంటివి, ఐనను=ఖలులశిక్షింపఁబూనుకొన్నను, ఇంకన్=ఇఁకమీఁదట (ఈదూర్వాసుని శిక్షించుట.)చాలును.(ఏలయన)ఆపన్నుఁడై=ఆపదచెందినవాఁడై, ఉన్నతపసిన్=ఉన్నట్టి యీఋషిని, ధర్మవృత్తిన్ = శరణాగతరక్షణమనెడి ధర్మమునాచరించువాఁడవగుటచేత, ఈవు=నీవు, కావుము=రక్షింపుము.

తా. ఓచక్రరాజా! శ్రీవిష్ణుమూర్తి దుర్మార్గులను శిక్షించునట్లు నీకాజ్ఞాపింపఁగా నీవందులకుఁ బూనికొనియున్నాఁడవు. కాని యీబ్రాహ్మణుఁడు

ముందు తెలియక దుర్మార్గముచేసినను నిపు డాపదలో మునిఁగియున్నాఁడు. నీవన్ననో శరణాగతులను రక్షించువాఁడవు. కాన గతిలేని యీబ్రాహ్మణుని రక్షింపవయ్యా.

వ. అని వినుతించి కేలుఁదమ్మిదోయి నొసటఁ బొసఁగించి యి
ట్లనియె. 54

టీ. అని, వినుతించి=స్తోత్రముచేసి, కేలు దమ్మిదోయిన్=తామరపూవులవంటి తన రెండుచేతులను, నొసటన్=నొసలియందు, పొసఁగించి=చక్కఁగఁజేర్చి, ఇట్లు, అనియె.

తా. అంబరీషుఁ డిట్లు స్తోత్రముచేసి మరల నమస్కరించుచుఁ జక్రాయుధముతో నిట్లు విన్నవించుకొనుచున్నాఁడు.

ఆ. ఏ నమస్కరింతు నింద్రశాత్రవధూమ
కేతువునకు ధర్మసేతువునకు
విమలరూపమునకు విశ్వగోపమునకుఁ
జక్రమునకు గుప్తశక్రమునకు. 55

టీ. ఇంద్ర...కేతువునకున్-ఇంద్రశాత్రవ = ఇంద్రునికి శత్రువులైన రాక్షసులకు, ధూమకేతువునకున్=ధూమకేతువనెడి నక్షత్రమువలె బాధనుగలిగించుదానికి, ధర్మసేతువునకున్ = ధర్మమర్యాదను స్థాపించుదానికి, విమలరూపమునకున్=నిర్మలమైన (ప్రకాశించెడి) యాకారము కలదానికి, విశ్వగోపమునకున్ = లోకములను రక్షించుదానికి, గుప్తశక్రమునకున్ = ఇంద్రుని రక్షించినదానికి, చక్రమునకున్=చక్రాయుధమునకు, ఏను=నేను, నమస్కరింతును.

తా. ఓచక్రరాజా! నీవు జ్వలించుచున్న యాకారముతోవచ్చి సకలరాక్షసులనుసంహరించి యింద్రుని రక్షించి సకలధర్మములను దమతమ మర్యాదలందు నిలిపి సకలలోకములను రక్షించినమహాత్ముఁడవు. నీమహాత్త్వము వర్ణింప నాకు సాధ్యపడదు. కాన నమస్కారముమాత్రము చేసెదను.

వ. అని మఱియు నిట్లనియె. 56

టీ. అని=ఇట్లు విన్నవించి, మఱియున్=ఇంకను, ఇట్లనియె.

ఆ. విహితధర్మమునందు విహరింతునేనియు
నిష్టమైన ద్రవ్యమిత్తునేని
ధరణిసురుఁడు మాకు దైవతంబగునేని
విప్రునకు శుభంబు వెలయుఁగాక. 57

టీ. విహితధర్మమునన్ = శాస్త్రమందు విధించియున్న ధర్మమందు (వర్ణాశ్రమాచారములందు), విహరింతునేనియున్=అనాయాసముగా నున్న యెడలను, ఇష్టమైన=యాచకులకుఁ బ్రియమైన, ద్రవ్యము=ధనమును, ఇత్తునేని=ఇచ్చియున్న యెడలను, (ఇష్టము=యాగము, ఐనను = చేసియున్నను, ద్రవ్యమిత్తునేని=దానముచేసియున్నను, అనికొందఱర్థము చెప్పుదురు. ధరణిసురుఁడు=బ్రాహ్మణుఁడు, మాకు, దైవతంబు=దేవుఁడుగా, అగునేని, విప్రునకున్=దూర్వాసునికి, శుభంబు=మేలు, వెలయుఁగాక=కలుగనీ.

తా. ఇట్లంబరీషుఁడు సుదర్శనుని బ్రార్థించి ఇంకఁ దనసుకృతముచేతనైనను దూర్వాసుని రక్షింపనెంచి మరలనిట్లనియె. నేను వర్ణాశ్రమాచారములను జక్కఁగా ననుష్ఠించియున్న యెడలను, శ్రౌతస్మార్తకర్మములను బాగుగా నాచరించియున్న యెడలను, బ్రాహ్మణుఁడే దైవమని నమ్మియున్న యెడలను నా పుణ్యమంతటిచేతను నిదూర్వాసుఁడు సురక్షితుండై యుండుఁగాక.

క. అఖిలగుణాశ్రయుఁ డగుహరి
సుఖియై నాకొలువువలనఁ జొక్కెడినేనిన్
నిఖిలాత్మునయుం డగుటకు
సుఖమందుంగాక భూమిసురుఁ డివ్వేళన్. 58

టీ. అఖిలగుణఆశ్రయుఁడు = సకలకల్యాణగుణములను గలవాఁడు, అగుహరి=అగునట్టివిష్ణుమూర్తి, నాకొలువువలనన్=నా సేవవల్ల, సుఖియై=సంతుష్టుఁడై, చొక్కెడినేనిన్ = మైమఱచియున్న యెడల, నిఖిల ఆత్మమయుండు అగుటకున్ = శ్రీవిష్ణుమూర్తి సకలవస్తువులకు నంతరాత్మయై

యుండుటకు (అనుకూలముగా), ఇవ్వేళన్ = నేఁడు, భూమిసురుఁడు = దూర్వాసుఁడు, సుఖమందున్ గాక = సౌఖ్యపడనీ

తా. సకలకల్యాణగుణపరిపూర్ణుఁ డగు శ్రీమన్నారాయణుఁడు నా చేసెడిసేవకై మిగులసంతోషించి నాపై నధికప్రేమ నుంచియుండెనేని యిప్పటి యీదూర్వాసునిబాధను దాను సర్వాంతరాత్మ యగుటచేఁ జక్కఁగా నెఱింగినవాఁడు గాన నాపైనిప్రేమను నీఋషిపైనుంచి నాకై యీతనిఁ గాపాడుఁగాక.

వ. అని యివ్విధంబునం బొగడు పుడమి ఱేనివలన మన్నించి తపసికి దాహంబు నొందింపక రక్కసులగొంగచక్రంబు తిరిగి చనియె. అంత దుర్వాసుండు శాంతింబొంది మెల్లనిమాటల నారాజుం దీవించి యిట్లనియె.

టీ. అని = చెప్పి, ఇవ్విధంబునన్ = ఈప్రకారముగా, పొగడు = స్తోత్రముచేయునట్టి, పుడమిఱేనివలనన్ = అంబరీషమహారాజు నిమిత్తమై, మన్నించి = (ఆబ్రాహ్మణుని) క్షమించి, తపసికి = దూర్వాసునికి, దాహంబును = తాపమును, ఒందింపక = కలిగింపక, రక్కసులగొంగచక్రంబు = రాక్షసవిరోధియైన శ్రీవిష్ణుమూర్తిచక్రాయుధము, తిరిగి చనియెన్ = మరలిపోయెను. అంతన్ = పిమ్మట, దుర్వాసుండు, శాంతింబొంది = నెమ్మదినొంది, మెల్లనిమాటలన్ = మృదూక్తులతో, ఆరాజున్ = ఆయంబరీషుని, దీవించి = ఆశీర్వదించి, ఇట్లనియె.

తా. అని యంబరీషుఁడు స్తోత్రముచేయగాఁ జక్రరాజందులకు మెచ్చి దూర్వాసునిఁ దపింపక తిరిగి శ్రీవిష్ణుమూర్తిసన్నిధానంబునకుం జనియె. అంత దూర్వాసుఁడు నెమ్మదిచెంది యంబరీషు నాశీర్వదించి యతనితో నిట్లు పలుకఁ దొడఁగెను.

మ. నరనాథోత్తమ మేలుచేసితికదా నాతప్పు మన్నించి శ్రీ
హరిపాదాబ్జములింతమట్టుఁగొలుతే యాశ్చర్యమా నెన్నుచో

నరుఁడంద్రే నినుబోటిసాధులకుఁదానై యిచ్చుటల్ గాచుటల్
సారిదిఁ నైజగుణంబులై సరస వచ్చుంగాదె మిత్రాకృతిన్.

టీ. నరనాథ=ఉత్తమరాజశ్రేష్ఠుఁడా (అంబరీషుఁడా)! నాతప్పు=నా యపచారమును, మన్నించి=క్షమించి, మేలు=ప్రాణరక్షణమనెడి మేలును, చేసితికదా=చేసితివికదా, శ్రీహరిపాద అబ్జములు = శ్రీవిష్ణుమూర్తి యొక్క తామరపూవులవంటి పాదములను, ఇంతమట్టు=ఇంతబాగుగా, కొలుతె=కొలిచి యున్నాఁడవా! ఆశ్చర్యమౌను=నీకార్యమాశ్చర్యముగా నున్నది. ఎన్నుచోఁ = బాగుగ నాలోచింపగా (నిన్ను), నరుడంద్రే = మనుష్యమాత్రుఁడని చెప్పుదురా ! నినుబోఁటిసాధులకుఁ=నీవంటి సత్పురుషులకు, ఇచ్చుటల్=సుకృతమునైన నిచ్చుటలును, కాచుటల్=ప్రాణములను రక్షించుటలును, తానై=స్వయముగనే,(మీరపేక్షింపకయే) సారిదిఁ=క్రమముగా, నైజగుణంబులై=స్వాభావికగుణములై , మిత్రాకృతిఁ=స్నేహితులవలె, సరసఁ=దగ్గఱ, వచ్చుఁ గాదె=తప్పకవచ్చును.

తా. ఓ యంబరీషమహారాజా! శ్రీవిష్ణుమూర్తిపాదములకు నీవెంతో సేవచేసి యున్నాఁడవు. దానం జేసి కదా యింతశాంతిగలిగి నాతప్పులను మన్నించి నాప్రాణములను రక్షించువాఁడవైతివి. కాన నీవిష్ణుభక్తి యత్యాశ్చర్యమైనది. నిన్ను సామాన్యమనుజుఁడని తలంపరాదు. మఱియు మీవంటి మహాత్ములు తమ సుకృతములనైన నిచ్చి యాశ్రితులను గాపాడుదురు. అట్టి గుణములను వారై యపేక్షింపకున్నను నవి తామె వారియొదలఁ జేరి వారిస్వభావములతో కలిసి మిత్రులవలె వారియొద్ద మెలఁగుచుండును.

ఛందోవిషయము.—

'నరుఁడంద్రే నినుబోఁటి సాధులకుదానై యిచ్చుటల్ గాచుటల్.'

ఈపాదమునందలి యతి యఖండయతి యనఁబడును. సంధిచే అచ్చుతోఁగూడిన హల్లునకును, సంధిచేఁ గాక యచ్చుతోఁగూడిన హల్లునకును యతి మైత్రియుండెనేని యదియఖండయతి యనఁబడును ఈయతినిగుఱించి వేములవాడ భీమకవి తన కవిజనాశ్రయమందు లక్ష్యలక్షణరూపముగానొక పద్యము వ్రాసియున్నాఁడు.

"మానుగ విశ్రమాక్షరసమంచితమై స్వర మూఁదినం దదీ
యానుగుణాక్షరంబు గొనిరైనను జెప్పఁగనొప్పు నీక్రియన్
భానుసహస్రభాసిన్విపభాధిపుఁ డన్నటు లర్థయుక్తమై
పూనినచోనఖండవళి పొల్పగు నాదికవి ప్రణీతమై."

ఇంతియగాక దీనికిలక్ష్యముగా భాస్కరరామాయణమునుండి యొక పద్యమునుకూడ నుదాహరించియున్నాఁడు.

"అన్నవుతండ్రియట్ల వినుమంతియు కాదటమీఁదరాజవే
మన్నఁ గొఅంతలేదు మణిమండన ముఖ్యములైన కానుకల్."

కూచిమంచి తిమ్మకవి యీయతి కవిత్రయ ప్రయోగ సిద్ధము కాదనె నుగాని "ముకుళీకృతహస్తుఁ, డనునై యేనుండదేవుఁ డతిశయకరుణన్" (భార. అను. 374-ప.) ఇత్యాది ప్రయోగములు భారతమునసే కన్పడుచున్నవి. కొంద అర్వాచీనులు తిమ్మకవియభిప్రాయము ననుసరించి యీపాఠములను దిద్దిరి. అదియంతగా సమంజసము కాదని నామతము. వీరినాదమును జూడ నీయతి ప్రాచీనాంగీకృత మనియు నర్వాచీనకతిపయానంగీకృతమని యుఁ దోఁచెడిని.

వ. అదియునుంగాక. 61

టీ. అదియునుంగాక=ఆయంశముమాత్రమే గాక.

మ. ఒకమా రెవ్వనిపేరు కర్ణములలో నొయ్యారమై సోఁకినన్
సకలాఘంబులు పల్లటిల్లి తొలఁగున్ సంభ్రాంతితో నట్టిస
త్సుకరున్ మంగళతీర్థపాదు హరి విష్ణుం దేవదేవేశుఁ దా
రకలంకస్థితిఁ గొల్చుభక్తులకు లేదడ్డంబు రాజాగ్రణీ. 62

టీ. రాజ అగ్రణీ=రాజశ్రేష్ఠుఁడగు నోయంబరీషుఁడా! ఎవ్వనిపేరు =ఏవిష్ణుమూర్తినామధేయమును, కర్ణములలోన్=(జనుల)చెవులలో, ఒయ్యారమై=క్రీడారూపమై, ఒకమారు=ఒకతూరి, సోఁకినన్=తగిలినను, సకల అఘంబులు=పాపములెల్లను, పల్లటిల్లి=నశించి, తొలఁగున్=పోవును. అట్టిసత్ సుకరున్=అటువంటిపవిత్రుని, మంచివారికిసులభుని మంగళతీర్థపాదున్=

శుభమైన గంగానదీతీర్థము పాదమునఁ బుట్టినవానిని, హరిన్=ఆశ్రితుల పాపములను హరించెడివానిని, దేవదేవఈశున్=సకలదేవతలకునుబూజ్యులైన బ్రహ్మరుద్రులకును బ్రభువైనవానిని, విష్ణున్=శ్రీవిష్ణుమూర్తిని, తారు=తామై, అకలంకస్థితిన్ = నిష్కాపట్యముతో, సంభ్రాంతితోన్ = సంతోషముతో, కొల్చుభక్తులకున్=సేవచేసెడి భక్తజనులకు, అడ్డంబులేదు = ఏకార్యమును నిర్విఘ్నముగా జరుగును.

తా. ఓ యంబరీషుఁడా! శ్రీవిష్ణుమూర్తి నామధేయము నశ్రద్ధగా విన్నంతనే జనుల పాపమంతయుఁ దొలఁగుచుండ మిక్కిలి భక్తిశ్రద్ధలతో విన్నవారిని గూర్చి చెప్పనేల? నామధేయముమాట యటుండనీ. ఆయనయే తనయాశ్రితులపాపములను దొలఁగించువాఁడు. ఇంతటిపవిత్రుఁడు కావుననే యాతనిపాదములనుండి పవిత్రమై శుభకరమైన గంగానది యుద్భవిల్లినది. ఇతఁడు దేవాదిదేవతలగు బ్రహ్మరుద్రులకుంగూడ నీశ్వరుఁడు. ఇట్టివిష్ణుమూర్తి సత్పురుషులకే సులభుఁడుగాని యన్యులకుఁ గాదు. ఇతని నిష్కాపట్యులై ప్రేమతోఁ బూజించువారే సత్పురుషులు. అట్టివారి కేకార్యములు నాతని దయవల్లనే నిర్విఘ్నముగ నెఱవేఱుచుండును.

మత్త. తప్పులోఁగొని చక్రపావకదాహముం బెడఁబాపితే
నొప్పునొప్పుభవద్దయారసమోనరేశ్వరప్రాణముల్
సెప్పమున్నునుపోటుక్రమ్మఱఁ జేరెధన్యుఁడనైతి నీ
కెప్పుడున్ శుభ మేను గోరెద నింకఁ బోయెద భూవరా.

టీ. ఓనరేశ్వర=ఓ యంబరీష మహారాజా! ఏమిచెప్పఁగలను. (నీవు నాకుఁజేసిన యుపకారమును గుఱించి యనిశేషము.) తప్పు=నా యపచారము, లోఁగొని=క్షమించి, చక్ర పావక దాహమున్ = చక్రాయుధజ్వాలలవలనితాపమును, బెడఁబాపితివి = పోఁగొట్టితివి. ఔను=నిజము, (నా) ప్రాణముల్, మున్నును= మొట్టమొదటనే, పోయి=శరీరమువదలిపోయి, క్రమ్మఱన్=మరల, చేరెను=నాశరీరములోవచ్చి చేరెను. (కాన) ధన్యుఁడను=కృతార్థుఁడను, ఐతిని. (కాఁబట్టి) నీదయారసము=అందఱకునుభోగ్యమైననీదయ, ఒప్పును ఒప్పును=

మిక్కిలి బాగుగానున్నది. భూవరా = ఓరాజా! ఇంకన్=ఇఁకమీఁద,ఎప్పుడున్ = సర్వకాలములందును, ఏను, నీకు, శుభంబు = మేలునే, కోరెదను. పోయెదను=స్వర్గమునకుఁ బోయెదను.

తా. ఓ యంబరీషమహారాజా ! నీవు నాతప్పు మన్నించి యాచక్రసంతాపమునుండి నాకు బాధలేకుండఁ జేసితివి ఇప్పుడుగదా నాకుఁ బోయిన ప్రాణములు తిరిగివచ్చినట్లైనవి. ఇట్లు నాకార్యము నెఱవేర్చిననీదయ నేనే మఱి పొగడుదును. నీదయ సర్వోత్కృష్టమైనది. ఇఁక నేను నీకెప్పుడైనను మేలే చేయుచుందును. నేనింక స్వర్గమునకుఁ బోయివచ్చెదను.

క. అనిన విని రాజముఖ్యుఁడు
మునివల్లభుపాదములకు మ్రొక్కి కడున్స
న్నన సేసి యిష్టభోజన
మనువుగఁ బెట్టింపఁ దృప్తుఁ డయ్యె నతండున్. 64

టీ. అనినన్=దూర్వాసుఁ డిట్లు చెప్పఁగా, విని, రాజముఖ్యుఁడు=అంబరీషుఁడు,మునివల్లభుపాదములకున్ = ఋషిశ్రేష్ఠుఁడైనదూర్వాసునిపాదములకు, మ్రొక్కి=నమస్కరించి, కడున్=మిక్కిలి, సన్నన, చేసి=గౌరవించి, ఇష్టభోజనము=ఇంపైన యాహారమును,అనువుగన్=అనుకూలముగా, పెట్టింపన్, అతండున్=దూర్వాసుఁడును, తృప్తుఁడయ్యెను=తనివినొందినవాఁడయ్యెను.

తా. దూర్వాసు డిట్లు చెప్పఁగా వినియంబరీషుఁ డతనిపాదములపైఁబడి మ్రొక్కి గౌరవముతోఁ బిలుచుకొనిపోయి మృష్టాన్నమును జక్కఁగాఁ బెట్టించెను. అవి భుజించి దూర్వాసుఁడు తనివినొందెను.

వ. మఱియు నమ్మునీంద్రుం డిట్లనియె. 65

టీ. మఱియు=ఇంకను, అమ్మునీంద్రుండు = ఆ దూర్వాసుఁడు, ఇట్లనియె=అంబరీషునితో నిట్లు చెప్పెను.

శా. కంటిన్నేఁటికి నిన్ను నీవచనముల్ కర్ణద్వయింబ్రీతిగా
వింటిన్నన్నముఁగొంటినీగృహమున న్వేడ్కన్ ఫలంబందెనే

మంటింబో యెద నీచరిత్రమమరుల్ మర్త్యుల్ సుఖాసీనులై
మింటన్ మేదిని సన్నుతింపఁగలరీమీఁద న్నరేంద్రాగ్రణీ.

టీ. నరేంద్ర అగ్రణీ = ఓ.రాజాధిరాజా (అంబరీషా)! నేఁటికిన్= నేఁడు,నిన్నున్,కంటిని=దర్శనము చేసికొంటిని. నీవచనముల్= నీమాటలు, కర్ణద్వయిన్ రెండుచెవులతోను,ప్రీతిగా, వింటిని. నీగృహమునన్=నీయింటియందు, అన్నమును, కొంటిని=భుజించితిని, వేడ్కన్=సంతోషముతో, ఫలంబు=ప్రాణరక్షణమనెడి ఫలము, అందెన్ = నన్నుఁ బొందెను. (నాకుఁ గలిగెను ) నేను, మంటిన్=బ్రదికితిని, పోయెదను. నీచరిత్రము=నీకథను, అమరుల్=దేవతలు, మింటన్ =పైలోకముఁనందును, మర్త్యుల్=మనుష్యులు, మేదినిన్=భూలోకమందును, సుఖఆసీనులై=సుఖముగాఁ గూర్చున్నవారై, ఈమీఁదన్=ఇఁకమీఁదను, సన్నుతింపఁగలరు=పొగడఁగలరు.

తా. ఓయంబరీషుఁడా! నేఁడు నాకన్నులార నిన్ను దర్శనముచేసికొంటిని. నీవాక్యరత్నములను నేఁడు నాచెవులారవింటిని. నీయింట నేఁడు నాతనివితీర భుజించితిని. నాప్రాణములు నాకుఁదక్కె. మిగుల సంతోషమైనది. నా కార్యములు నెఱవేఱెను. నేనూర్ధ్వలోకమునకుఁ బోవలెను. నాకు సెలవొసంగుము. మనయిరువురకు జరిగినయీచరిత్రమును నిఁకమీఁదట దేవలోకమునందు దేవతలును భూలోకమునందు మనుజులును నెమ్మదిగాఁ గూర్చుండి పొగడుచుందురు.

వ. అనిచెప్పి దూర్వాసుం డంబరీషుని దీవించి కీర్తించిమింటితెరువున బ్రహ్మలోకంబునకుం జనియె. మునీశ్వరుండుమగుడం జను వేళకు నొకసంవత్సరంబునిండి వ్రతంబుపరిపూర్ణంబైన.

టీ. అనిచెప్పి=ఇట్లుచెప్పి, దూర్వాసుండు, అంబరీషుని,దీవించి=ఆశీర్వదించి, కీర్తించి= పొగడి, మింటితెరువునన్ = ఆకాశమార్గముగా, బ్రహ్మలోకంబునకున్=బ్రహ్మయుండెడి సత్యలోకమునకు, చనియెను=పోయెను. మునీశ్వరుండు=దూర్వాసుఁడు, మగుడన్=తిరిగి (రెండవతూరి), చను వేళ

కున్=(అంబరీషునింటికి)వచ్చునప్పటికి,ఒక్క సంవత్సరంబు = ఒక్కయేఁడు, నిండి=పూర్ణమై, వ్రతంబు=అంబరీషుని ద్వాదశీవ్రతము, పరిపూర్ణంబై నన్=ముగిసియుండఁగా.

తా. అని దూర్వాసుఁ డంబరీషుని దీవించి పొగడి యాకాశమార్గముగా బ్రహ్మలోకమునకుఁ బోయెను. ఇచ్చట దూర్వాసుఁడు తెండవతూరి యంబరీషునింటికి వచ్చునప్పటి కొకసంవత్సరకాలముపట్టినది. అప్పటికే యంబరీషుఁడు ద్వాదశీవ్రతపూర్తియునై యుండెఁగదా.

ఆ. అవనిసురుఁడు గుడువ నతిపవిత్రం బైన
వంటకంబు భూమివరుఁడు గుడిచె
దపసియెగ్గు మాన్ప దానెంతవాఁడను
హరికృపామహత్త్వ మనుచుఁదలఁచి. 68

టీ అవనిసురుఁడు=దూర్వాసుఁడు, కుడువన్ = భుజింపఁగా, అతిపవిత్రంబు=మిక్కిలి పరిశుద్ధము, ఐనవంటకంబు = అయినట్టియన్నమును, భూమివరుఁడు=అంబరీషమహారాజు, కుడిచెను=భుజించెను. తపసియెగ్గు=దూర్వాసునికష్టమును,మాన్పన్=తీర్చుటకు, హరి కృపామహత్త్వము=శ్రీవిష్ణుమూర్తి యనుగ్రహప్రభావమే, (కారణము.) అనుచుఁదలఁచి = ఈరీతిగా నెంచి, తాను, (అంబరీషుఁడు), ఎంతవాఁడు=ఏమాత్రము శక్తిలేనివాఁడు, అను=అనిచెప్పును.

తా. దూర్వాసుఁడు భుజించి శేషించియున్న యన్నము నంబరీషుఁడుమిగులఁ బవిత్రమనియెంచి భుజించెను. మఱియు దూర్వాసునియిడుమలు తానుదీర్పలేదనియుఁ బరమకృపాళువైన శ్రీకృష్ణమూర్తిమహత్త్వమే వానిం దీర్చెననియు నెంచుచుండెను.

వ. మఱియును. 69

టీ. మఱియును=ఇంకను.

క. హరిఁగొల్చుచుండు వారికిఁ
బరమేష్ఠిపదంబు మొదలు పరభోగంబుల్

నరకసమం బనుతలఁపున
ధరణీ రాజ్యంబుతోడి తగులము మానెన్. 70

టీ. హరిన్=శ్రీవిష్ణుమూర్తిని, కొల్చుచుండువారికిన్=భక్తితో సేవచేయుచుండువారికి, పరమేష్ఠిపదంబు మొదలు = బ్రహ్మపదవి మొదలుగాగల, పరభోగంబుల్ = గొప్పసౌఖ్యస్థానములును, నరకసమంబులు = నరకము వంటివి, అనుతలఁపునన్=అనెడివివేకముతో, ధరణీ...తగులము=భూలోకరాజ్యముతో దనకున్న సంబంధమును, మానెన్=వదలెను.

తా. మఱియు సాధారణజనులు బ్రహ్మపదవి మొదలగువానిని గొప్పసౌఖ్యకరములైన స్థానములనుగాఁ దలఁతురు గాని విష్ణుభక్తుల కవి నరకము వలె దుఃఖకరములనియెంచి యంబరీషుఁడు రాజ్యసంబంధమును వదలిపెట్టెను

వ. ఇట్లు విరక్తుండై. 71

టీ. విరక్తుండై=వైరాగ్యముగల వాఁడై.

ఆ. తనకుసదృశులైన తనయులరావించి
ధరణిభరము వారిఁ దాల్పఁబంచి
కాననంబుసొచ్చెఁ గామాదివిజయుఁడై
నరవిభుండు హరిసనాథుఁ డగుచు. 72

టీ. నరవిభుండు = అంబరీషుఁడు, హరిసనాథుఁడు = విష్ణువుతోకూడుకొన్నవాఁడై, కామ ఆది విజయుఁడై = కామక్రోధాదులైనయరిషడ్వర్గమును జయించినవాఁడై, తనకుసదృశులైన = తనవంటిబలపరాక్రమాదులు కలవారైన, తనయులన్=కుమారులను, రావించి=పిలిపించి, వారిని = కుమారులను, ధరణిభరము=రాజ్యభారమును, తాల్పన్ = ధరించునట్లు, పంచి=ఆజ్ఞాపించి; (తాను) కాననంబును=అరణ్యమును, చొచ్చెన్=ప్రవేశించెను.

తా. అంబరీషుఁడు విష్ణుభక్తుఁడుగాఁగలవాఁడై యరిషడ్వర్గములను జయించి విరక్తుఁడాయెను గాన, దనపుత్త్రులకు రాజ్య మప్పగించి తానరణ్యమునకుఁ బోయెను.

అని ఈచరిత్రము చదువుటవలని ఫలమును జెప్పుచున్నాఁడు.—

క. ఈయంబరీషచరితముఁ
దీయంబున విన్నఁ జదువ ధీసంపన్నుం
డై యుండును భోగపరుం
డై యుండును నరుఁడు పుణ్యుఁడై యుండు నృపా. 73

టీ. నృపా=ఓ పరీక్షిన్మహారాజా! నరుఁడు=మనుష్యుఁడు, ఈ అంబరీషచరితమున్, తియ్యంబునన్=ఇష్టముతో, విన్నను=వినినను, చదువన్=తానే చదివినను, ధీసంపన్నుండై=పరిపూర్ణ బుద్ధిమంతుఁడై, ఉండును=అగును. భోగపరుఁడై = మోక్షసౌఖ్యమే ప్రధానముగాఁ గలవాఁడై, ఉండును=అగును. పుణ్యుఁడై=పుణ్యముకలవాఁడై, ఉండును=అగును.

తా. మనుష్యులలో నేజాతివాఁడైనను నీయంబరీషచరితమును జదివెనేని దీనిమహత్త్వముచే నతనికి సద్బుద్ధి యతిశయించును. మోక్షసుఖము నపేక్షించును. తదనుకూలముగఁ బుణ్యము సంపాదించును. అని శుకబ్రహ్మర్షి పరీక్షిన్మహారాజుతోఁ జెప్పెను.

అంబరీషోపాఖ్యానము సంపూర్ణము.

---

'వావిళ్ల' ప్రెస్, తండయార్పేట, చెన్నపురి—1924.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| మదనగోపాలశతకము, వంకాయలపాటి వేంకటకవి ... | 0 | 2 |
| మహిజామనోహరశతకము, రేమెల రామదాసకవి ... | 0 | 2 |
| మాధవశతకము, అల్లంరాజు రంగశాయికవి ... | 0 | 2 |
| మానసబోధశతకము, సటీక, పానకాలరాయకవి ... | 0 | 3 |
| మాతృశతకము, అప్పావుమొదలారి ... | 0 | 2 |
| మహిషాసురమర్దనిశతకము ... | 0 | 2 |
| ముకుందరాఘవశతకము, జాలూరి లక్ష్మణకవి ... | 0 | 4 |
| యాదగిరీంద్రశతకము, తిరువాయిపాటి వెంకటకవి ... | 0 | 2 |
| రఘురామశతకము, అల్లంరాజు రంగశాయికవి ... | 0 | 2 |
| రామచంద్రశతకము, యేటుకూరి సీతారామయ్య ... | 0 | 4 |
| రఘువీరశతకము, (ఒంటిమిట్ట రఘువీరశతకము) ... | 0 | 2 |
| రఘుతిలకశతకము, దిట్టకవి రామచంద్రకవి ... | 0 | 2 |
| రంగశాయిశతకము ... | 0 | 4 |
| రంగేశశతకము, శ్రీ వేంకటరామ నృసింహాచార్యస్వామి ... | 0 | 2 |
| రమణీమనోహరశతకము, గంగాధరకవి ... | 0 | 2 |
| రమాధీశ్వరశతకము ... | 0 | 2 |
| రుక్మిణీపతిశతకము, దిట్టకవి రామయోగివిరచితము ... | 0 | 2 |
| రేఫాలరాజలింగశతకము, కొమర్రాజు వేంకటశివుడు ... | 0 | 4 |
| లక్ష్మీపతిశతకము, పరవస్తు మునినాథకవి ... | 0 | 2 |
| లావణ్యశతకము, పోలిపెద్ది వేంకటరాయకవి ... | 0 | 4 |
| వసుదేవనందనశతకము, వెల్లాల రంగయ్యకవి ... | 0 | 4 |
| విశ్వనాథశతకము, అమలాపురము సన్యాసికవి ... | 0 | 3 |
| వీరనారాయణశతకము, రావూరి సంజీవకవి ... | 0 | 4 |
| వేంకటేశశతకము, తాళ్లపాక పెదతిరుమలాచార్యవిరచితము | 0 | 4 |
| వేమనశతకము ... | 0 | 4 |
| శరభాంకలింగశతకము ... | 0 | 3 |
| సర్వమంగళాశతకము, సత్యవోలు సోమసుందరకవి ... | 0 | 2 |
| శివశతకము, పూర్వకవికృతము ... | 0 | 2 |
| వృషాధిపశతకము, పాలకురికి సోమనాథకవి ... | 0 | 2 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| నారాయణశతకము, పోతనకవి | ... | 0 | 2 |
| జగన్నాయకశతకము, వరాహగిరి కొండ్రాజకవి | ... | 0 | 2 |
| ప్రసన్నరాఘవశతకము, వంగూరి ముద్దునరసకవి | ... | 0 | 3 |
| రాజగోపాలశతకము | ... | 0 | 4 |
| రాజశేఖరశతకము, సత్యవోలు సోమసుందరకవి | ... | 0 | 2 |
| రామశతకము, జయంతి కామేశముపంతులు | ... | 0 | 2 |
| రామలింగేశశతకము, అడిదము సూరకవి | ... | 0 | 3 |
| రామతారకశతకము | ... | 0 | 4 |
| రామప్రభుశతకము, ప్రయాగ కామేశ్వరకవి | ... | 0 | 2 |
| రామరాఘవశతకము, పల్లి పార్వతీశకవి | ... | 0 | 2 |
| రామరామశతకము, తోట వేంకటనరసింహకవి | ... | 0 | 2 |
| భద్రాద్రిరామశతకము, పావులూరి మల్లన | ... | 0 | 2 |
| డిటో (వేదాంతము) పరశురామ నరసింహదాసు | ... | 0 | 4 |
| శివముకుందశతకము, పరమానందయతీంద్రులు | ... | 0 | 2 |
| ఒంటిమిట్ట రఘువీరశతకము, అ॥ త్రిపురాంతకకవి | ... | 0 | 2 |
| కాళహస్తిశతకము, బాణాల వీరశరభకవి | ... | 0 | 3 |
| కాళహస్తీశ్వరశతకము, ధూర్జటికవికృతము | ... | 0 | 3 |
| కుక్కుటేశ్వరశతకము, కూచిమంచి తిమ్మకవి | ... | 0 | 4 |
| చిత్తబోధశతకము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 3 |
| మారుతిశతకము, గోటికలపూడి కోదండరామకవి | ... | 0 | 2 |
| ముకుందశతకము, దూపాటి తిరుమలాచార్యులు | ... | 0 | 2 |
| భక్తిరసశతకసంపుటము I 20 శతకములు | ... | 3 | 0 |
| ,, II ,, | ... | 3 | 0 |
| ,, III ,, | ... | 3 | 0 |
| నీతిశతకసంపుటము I ,, | ... | 3 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.